# విషయసూచిక

# అంతర్జాతీయ బాలల సంవత్సరం

1979వ సంవత్సరం, అంతర్జాతీయ బాలల సంవత్సరంగా జరుగుతూ వుంది. ఈ ఏడాదిలో, బాలల సంక్షేమ ప్రాధాన్యం కల అమలులోవున్న పథకాలను యింకా దీక్షగా అమలు జరపడానికి ఉద్దేశింప బడింది; ఇవి కాక ఆంధ్రప్రదేశ్‌లో కొత్త పథకాలు కూడా చేపట్టబడతాయి.

ఆదిలాబాద్, అనంతపురం జిల్లాలలో సమన్వయీకృత బాలల అభివృద్ధి కార్యాల పథకం అమలవుతోంది. పోషకాహారం, ఆరోగ్యం, విద్య, వినోద సౌకర్యాలు వుండే సమన్వయీకృత కార్యావళి, యీ పథకంలో వుంది.

తూర్పు గోదావరి, వరంగల్, కృష్ణ, కర్నూలు జిల్లాలలో యింకో నాలుగు బ్లాకులు 1978-79 సం.రాలలో చేపట్టబడ్డాయి. అంతర్జాతీయ బాలల సంవత్సరంలో విశాఖ పట్టణం, చిత్తూరు, మెదక్ జిల్లాలలో యింకో మూడు బ్లాకులు చేపట్టబడతాయి.

డి. జి. ఐ. అండ్ పి. ఆర్. 43

# సోవియట్ సమీక్ష

ఇంగ్లీషు, తెలుగు, తమిళం, మలయాళం, కన్నడం, యింకా మరో ఏడు యితర భారతీయ భాషల్లో మాసానికి ఐదు సంచికలు ప్రకటించబడుతూన్న సమగ్ర పత్రిక.

సైద్ధాంతిక విషయాల గురించీ, సోవియట్ దేశంలోని ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిణామాలకు సంబంధించిన వివిధ అంశాల గురించి సవివరంగా తెలియజెప్పే పత్రిక. నేడు తగ్గింపు రేట్లకు లభిస్తూవుంది.

**సంవత్సరం చందా : రు. 5-00**
**మూడు సంవత్సరాలకు రు. 12-00**

మీ చందాలను మనియార్డరు ద్వారాగానీ, క్రాస్ చేసిన పోస్టల్ ఆర్డర్ ద్వారాగానీ ఈ క్రింది చిరునామాకు సరాసరి పంపండి:

## సోవియట్ భూమి కార్యాలయం

115, త్యాగరాయ రోడ్డు,
మద్రాసు- 600 017.

# అభ్యుదయ

సంచిక 4, సంపుటి 3 ఏప్రిల్ 1979 సాలు చందా పది రూపాయలు

## బొమ్మా - బొరుసూ

అదృష్ట దీపక్

ఉత్సవాలు - ఉపన్యాసాలు-
పత్రికల నిండా ప్రత్యేక శీర్షికలు -
అవును ఇది బాలల సంవత్సరం!
అందుకే ఇంత అందమైన కోలాహలం!
బలమైన బంగారు బాబుల కోసం
బహుమతులు ఎదురు చూస్తున్నాయి!
'మమ్మీ', 'డాడీ'లను వెంటబెట్టుకుని
'ఇంగ్లీషు' నవ్వులు మూట కట్టుకుని
'కాన్వెంటు' పిల్లలు కార్లలో వస్తున్నారు
తల్లీ పిల్లల్లో ఎవరు అందంగా ఉన్నారని
తికమకపడుతున్న మంత్రి వర్యా!
ప్రస్తుతానికి పిల్లనే ముద్దు పెట్టుకోండి -
ఫొటోగ్రాఫర్లు సిద్ధంగా ఉన్నారు!

ఇది బాలల సంవత్సరం!
వ్యధాకలిత కథా సాగరం!
పౌష్టికాహార లోపంతో మరణిస్తున్న
పసిపిల్లల సంఖ్య
పెరుగుతూనే ఉంటుంది;
పలకలూ, బలపాలూ పంచిపెడుతున్నా
పిల్లలు బళ్లోకి వెళ్లలేని కారణాలు
వ్యవస్థను వెక్కిరిస్తూనే ఉంటాయి!

ఆకలి అరణ్యాల్లో చిక్కుకుపోయిన
అమాయకపు బాటసారులు వీళ్లు -
నేల తల్లీ - నువ్వయినా
కొత్త దారులు చూపు!
నిరక్షరాస్యత ఎడారుల్లో
నిద్రపోతున్న పిచ్చి మొక్కలు వీళ్లు -
గాలి తల్లీ నువ్వయినా
కొన్ని పాఠాలు నేర్పు!

## ముఖ్య ప్రకటన

ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం 8వ మహాసభ తీర్మానాన్ని అనుసరించి, 'అభ్యుదయ' రాష్ట్ర సంఘ పత్రికగా మే నెల సంచిక నుంచీ హైదరాబాద్ నుండి వెలువడు తుంది. పాఠకులు, ప్రకటన కర్తలు, ఏజెంట్లు, చందాదారులు మొదలయినవారు యీమార్పును గమనించ వలసినదిగా కోరుతున్నాము.

పైకం తప్ప తక్కిన వాటిన్నిటికీ చిరునామా :

Yetukuri Prasad,
3-6-737/3,
Himayatnagar,
Hyderabad - 500 029

పైకం (చెక్కులు, డ్రాఫ్టులు, మని ఆర్డర్లు) మొదలయిన వాటికి చిరునామా :

Y. Vijaya kumar,
3- 5-911/B1, Himayatnagar,
Hyderabad-500 029

# డాక్టర్ పుప్పల లక్ష్మణరావు

కాట్రగడ్డ గంగయ్య

ఇతివృత్తం, కథాకథనం రెండింటి విషయంలోనూ ప్రశస్తమైన నవలలలో విశిష్టమైనదిగా నిలిచే బృహత్తర నవల 'అతడు – ఆమె' కర్త, డాక్టర్ పుప్పల లక్ష్మణరావు యిటీవలనే జరిగిన ఆంధ్ర ప్రదేశ్ అభ్యుదయ రచయితల మహాసభలోనూ, అఖిల భారత తెలుగు రచయితల సమ్మేళనంలోనూ సన్మానింపబడడం, నిజమైన యోగ్యతకు గుర్తింపు చాలా ఆలస్యంగా వస్తుందన డానికి తార్కాణం. ఈ నవల మూడో భాగం ప్రచురణ ఇటీవలనే జరిగినా, మొదటి రెండు భాగాలు వెలువడి ముప్ఫయ్యేళ్ళయింది. అప్పట్నుండీ మంచి అభిరుచిగల పాఠకుల మనస్సుల్లో అది నిలిచి వుందంటే అతిశయోక్తి ఏమీ కాదు. ఈ కోవకు చెందిన సాహిత్యంలో, యీ విధంగా చెప్పుకోదగ్గది ఒక్క 'మాలపల్లె' మాత్రమే. సాహిత్య సంస్థలకు, అకాడమీలకు, జ్ఞాన పీఠాలకూ తరచు ఉత్తమ సాహిత్యం కంటికానదు. అందుచేత ఒక ఉత్తమోత్తమ రచయితకు సన్మానాన్ని తలపెట్టిన యీ మహాసభలను అభినందించ వలసి వుంటుంది.

నవలా రచయితగా మాత్రమే కాదు, లక్ష్మణరావు గారి జీవితం బహుముఖమైనది. 50–60 ఏళ్ళుగా అనేక ప్రగతిశీలమైన కార్యకలాపాలతో ఆయనకు సన్నిహిత సంబంధం వున్నది. ఎనభయ్యేళ్ళు దాటిన పండు వయసులో నేటికీ ఆయన ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రజాహిత చింతగల ఉద్యమాలకు సాయపడుతున్నారు, వాటిలో పాల్గొనే యువకులను ఉత్సాహపర్చుతూనేవున్నారు.

1898 లో బరంపురంలో జన్మించిన లక్ష్మణరావు గారు హైస్కూలు చదువు అక్కడే ముగించి, కలకత్తా విశ్వవిద్యాలయంలో 22వ ఏట వృక్షశాస్త్రంలో బి. ఎస్సి. ఆనర్స్ పట్టం పొందారు. 1924 లో ఎడింబరో విశ్వవిద్యాలయంలో ఎం. ఏ, తదుపరి ట్యూబిన్‌గెన్ విశ్వవిద్యాలయంలో (జర్మనీ) వృక్షశాస్త్రంలో డాక్టరేట్ తీసుకొన్నారు.

విద్యాభ్యాసం ముగిసేక 1926 – 27 సంవత్సరాలలో, బెంగాల్ నాగపూర్ రైల్వేలో ముమ్మరంగా సమ్మెలు జరుగుతున్న కాలంలో, వరహగిరి వెంకటగిరి గారికి లక్ష్మణరావు గారు అంతరంగిక కార్యదర్శిగా పనిచేశారు. ఆ తరవాత రెండేళ్ళు సర్ జె. సి. బోస్ పరిశోధనా సంస్థలో పరిశోధన చేశారు. 1929 – 30 లో కాకినాడ పి. ఆర్. కళాశాలలో వృక్ష శాస్త్ర ప్రధానోపన్యాసకునిగానూ, 1930 లో అలిఘర్ విశ్వవిద్యాలయంలోనూ పని చేసారు. జాతీయోద్యమంలో ఐదేళ్ళ పాటు (1930–34) పాల్గొన్నారు, ముఖ్యంగా ఖాదీ గురించి సాంకేతిక పరిశోధనలు చేశారు, తదుపరి రెండు దశాబ్దాలపాటు (1934–54) ఆంధ్రా సిమెంట్ ఫాక్టరీలో

ముఖ్య సేల్స్ ఎగ్జిక్యూటివ్‌గా ఉన్నారు.

జీవితంలో ఏ వ్యాపకాలలో నిమగ్నమై ఉన్నప్పటికీ దేశంలోనూ, ప్రపంచంలోనూ జరుగుతూవున్న పరిణామాలపట్ల లక్ష్మణరావు గారికి ఆసక్తి తగ్గలేదు ; రానురానూ వయస్సు హెచ్చుతూవున్నా, పిడుగుపాటు వంటి సతీవియోగం సంభవించినా ఆ పరిణామాల పట్ల ఆయన అసక్తి నాడూ నేడూ ఒకే విధంగా వుంది.

సోవియట్ దేశం పట్ల ఆసక్తి, అనురక్తి లక్ష్మణరావుగారి జీవిత విశేషాల్లో ముఖ్యమైనవి. 1937 లోనే ఆయన ఆ దేశాన్ని కళ్ళారా చూశారు. ఆయన చిరకాల మిత్రురాలు, భారత స్వాతంత్రోద్యమంలో పాల్గొని కారాగార శిక్షలు అనుభవించిన జర్మన్ జాతి వనిత మెల్లీ సోలింగర్‌గారితో లక్ష్మణరావుగారి వివాహం మాస్కోలోనే జరిగింది.

భారత దేశానికి వచ్చిన తరువాత, ఆ తొలి సోషలిస్టు దేశంలో తాను చూసిన దానిని తన దేశీయులకు చెప్పాలన్న తహ తహతో లక్ష్మణ రావు గారు, భార్యతో కలసి ఒక గ్రంధం వ్రాశారు. ''సోవియట్ దేశం – భూతల స్వర్గం'' అన్న పేరుతో తెలుగులో 35 ఏళ్లక్రితం వెలువడి, అది ఎంతో మందిని ప్రభావితులను చేసింది.

సోవియట్ దేశాన్ని సర్వనాశనం చెయ్యడానికి హిట్లర్ పైశాచిక యుద్ధం సాగిస్తూవుండిన కాలంలో, నాజీ సేనలు మాస్కో పొలిమేరలను సమీపించిన గడ్డు దినాలలో సైతం అంతిమ విజయం సోషలిజానిదే అన్న విశ్వాసాన్ని ఆయన ప్రకటించారు. ఆనాటి ఫ్రెండ్స్ ఆఫ్ సోవియట్ యూనియన్ ఆంధ్ర శాఖకు అధ్యక్షులుగా వుండేవారు. నేటికీ లక్ష్మణరావుగారికి ఇస్కస్‌తోనూ, అఖిల భారత శాంతి సంఘం, అఖిల భారత ఇండో – జి. డి. ఆర్. సంఘం మొదలైన అభ్యుదయ కాముక సంస్థలతో సన్నిహిత సంబంధాలున్నాయి. 1954లో ఇస్కస్ ప్రతినిధి వర్గ సభ్యులుగానూ, రెండేళ్ళ తరువాత శాంతి ఉద్యమ ప్రతినిధివర్గ సభ్యులుగానూ సోవియట్ దేశంలో ఆయన పర్యటించారు. ప్రపంచ విఖ్యాత జర్మన్ మహాకవి హెన్రిక్ హైనె జన్మదినోత్సవాల సందర్భంగా, జర్మన్ ప్రజాస్వామిక రిపబ్లిక్ ఆహ్వానం పైని, ఏకైక భారతీయ ప్రతినిధిగా ఆ దేశానికి వెళ్ళి వచ్చారు.

తదుపరి రెండేళ్ళు (1957–1958) జర్మన్ ప్రజాస్వామిక రిపబ్లిక్ లోని గ్రైయ్‌ఫీల్డ్ విశ్వవిద్యాలయంలో సీనియర్ ఫెల్లో పదవిలో లక్ష్మణరావు గారు వృక్షశాస్త్రం బోధించారు.

తరవాత లక్ష్మణరావు గారు 1970లో స్వదేశానికి తిరిగి వచ్చేవరకూ సోవియట్ దేశంలో ప్రగతి ప్రచురణాలయం తెలుగు శాఖలో పని చేసి, తెలుగులో సోవియట్ గ్రంధాల అనువాదం, ప్రచురణలను నిర్వహించారు. ఈ కాలంలోనే తెలుగు– రష్యన్ నిఘంటువుకు ప్రధాన సంపాదకులుగా పని చేశారు. ఈ బృహత్తర గ్రంధం 1972లో ప్రచురణ అయ్యింది. సోషలిస్టు వ్యవస్థకు పునాదులు పడుతున్న తొలి సంవత్సరాలలో సోవియట్ దేశానికి తరలివెళ్లిన శాస్త్రవేత్త, ఆంధ్రుడు అయిన డాక్టర్ కొలచల సీతారామయ్య గారు సోవియట్ దేశంలో అంకురార్పణ చేసిన తెలుగు బోధనను లక్ష్మణరావు గారు కొనసాగించారు. ఆయన తెని

గించిన శాస్త్రీయ సోషలిజం, విజ్ఞాన శాస్త్రం మొదలైన విషయాలకు సంబంధించిన ఎన్నో పుస్తకాలను ప్రగతి ప్రచురణాలయం ప్రచురించింది.

జర్మన్ ప్రగతిశీల సాహిత్యాన్ని తెలుగు వారికి పరిచయం చేయడానికి, ఆ సాహిత్యాన్ని చాలా అనువదించారు. భారత - జర్మన్ ప్రజాస్వామిక రిపబ్లిక్కుల ప్రజల మైత్రి పెంపొందడానికి విశిష్ట కృషి చేసినందుకు, జర్మన్ ప్రజాస్వామిక రిపబ్లిక్ మైత్రీ సంస్థ లక్ష్మణరావు గారికి 1973లో స్వర్ణ పతకమిచ్చి సత్కరించింది.

1970లో సోవియట్ దేశం నుండి తిరిగి వచ్చిన తరువాత, స్వస్థలమైన బరంపురంలో స్థిరపడి, అభ్యుదయ సాహిత్య వ్యాప్తికి, సోషలిస్టు భావాల వ్యాప్తికీ, ఎనిమిది పదులు దాటిన యీ వయస్సులోనూ లక్ష్మణరావు గారు పాటుపడుతూనే వున్నారు.

(1943. జాతీయోద్యమ ప్రముఖ నాయకురాలు, అఖిల భారత సోవియట్ దేశ మిత్రుల సంఘం అధ్యక్షురాలు శ్రీమతి సరోజినీ నాయుడు, అక్టోబరు మహావిప్లవం 26వ వార్షికోత్సవం సందర్భంగా సోవియట్ ప్రజల కర్పించిన అభివాదాలు)

# సోవియట్ ప్రజలకు సరోజినీ నాయుడు అభివాదాలు

వీర ప్రజలారా! భారత దేశ నాయకులింకా జైళ్లలో వున్నారు. మీకభివాదార్పించలేరు. అంచేత, భారత దేశం పేరున మీకు స్మరణీయమైన నవ రష్యా ప్రసవయాతన, విజయాల యిరవయ్యారవ వార్షికోత్సవ సందర్భంగా సుహృద్భావ, కృతజ్ఞతా సందేశాన్ని పంపే మహదవకాశం నాకు లభించింది.

గర్వ భావంతోను, అబ్బురంతోను అల్పమైన శతాబ్ద చతుర్థ భాగంలో మేము మీ మహోత్తర విజయాల ఇంద్రజాలాన్ని గమనించాము. ఈ అల్పకాలం మానవ ప్రగతి చరిత్రలో ఒక్క నాడీ స్పందన కాలం మాత్రమే.

రక్తం, కన్నీళ్లు ధారపోసిన మీ మహత్తర త్యాగాలతో, అజేయమైన మీ ఆశాభావంతో, స్వీయ భవిష్యత్తుపట్ల అచంచల విశ్వాసంతో విచ్ఛిన్నమైన సామ్రాజ్య శిథిలాల పైని పరమాద్భుతమైన ప్రజాస్వామ్య నవ ప్రపంచాన్ని నిర్మించారు మీరు. మీ రైతుల భగ్నశకటాన్ని లేవనెత్తి దానిని స్వేచ్ఛా తారకు పూన్చారు; కాలరాయబడిన మానవాళిని సమీకరించి, వారిని అజేయ వీర వాహినిగా రూపొందించారు. వారు యీ నాడు ప్రపంచ స్వాతంత్ర్యానికి, నాగరికతకు రక్షకులు, సంరక్షకులు.

జాతీయ స్వాతంత్ర్య సాధనకు తీవ్ర సమరంలోవున్న యితర దేశాలకు లాగనే భారత దేశానికి కూడా సాటిలేని మీ దృష్టాంతం ఉజ్వలమైన ఉత్సాహ దీపిక. రష్యా ప్రజలారా! మా వందనాలు; యిదే మీకు ప్రేమ, ప్రశంసా భరితమైన మా నివాళి.

సరోజినీ నాయుడు

హైదరాబాద్, దక్కన్

# కలప వృక్షం ?

## కథానిక

### నిష్టల వెంకటరావు

ఈమధ్య పెంపకాలు ఎక్కువై పోయేయి. కొన్ని బేంకులు కొన్ని పల్లెల్ని (పిల్లల్ని కాదు) పెంచుకుంటే, మేం మరి రెండు ఆకులు ఎక్కువే చదువు కున్నాం అని కంపెనీలు కూడా గ్రామా లని పెంచుకుంటున్నాయి. చరణ సింగ్‌ని చెక్ చెయ్యడానికి అనుకోగల్రు. నాట్ ఇన్ ది లీస్ట్. ఆ సింగు కేంద్రా నికి తిరువేంద్ర మంత దూరంలో వున్న ప్పుడే బిజినెస్ బిగ్‌ఓగ్స్ పల్లెల్ని ఓకంట కనిపెడితే గాని ప్రమాదం అని వేసిన పథకం లాగుంది ఈ పెంపకం.

బికారీమల్ దోపిడీలాల్ ఓ ప్రఖ్యాత బిజినెస్ – ఇండస్ట్రియల్ మేగ్నెటు. అలనాడు లోటా లంగోటాతో బయల్దేరిన వాడు ఈనాడు ఇండియానే కొనగల అ(న)ంత కోటీశ్వరుడు. ఈ గురుడుకి ఉన్న మూడొంపల కంపెనీలలో ఓ పెద్ద కంపెనీ ఓ(న)మాల పల్లెని పెంచు కుందికి దత్తత స్వీకార మహో త్సవ ప్రారంభోత్సవం తల పెట్టింది. గురూజీ స్వయంగా రిబ్బను తాను తెంపు తారు. అదీ గిరాకీ.

గురుడు గారు పంచ కట్టేరు. కళ్ళీ కమీజు ధరించేరు. అందరికి కనపడే లాగా తన బుర్ర మీద టోపీ పెట్టు కున్నారు. ఎవ్వరికీ కన పడని టోపీలు ఎందరికో పెట్టడానికే ఈ ప్రారంభో త్సవం. బికారీ మల్ జీ వేదిక నలంక రించేరు. అలంకరించిందే తడువు ఆల స్యం సహించని దోపిడీజీ ఉపన్యాస విన్యాసం మొదలెట్టారు. ఏమని ?

"హీ రోజు నుంచి ఇది తడి చెట్టుల నగర్. ఇక్డ మేమూ తడీ చెట్టులు హెన్ని నటించేం !... హి హ్హి హ్హి.. మేమూ తడీచెట్టులు ఎందుక్క నటించేం? చెబుతా యినండి. తడీ చెట్టు భూలోక్ కలప వృక్షమ్! కలప వృక్షమ్ మీకు తెల్డూ? తెల్సా! తటీ మాను అది దూలమ్ ఇంటిక్క మెయిన్ పోల్! తటీ వాసమ్ తటీ పెండీబద్దు అంతా యిల్లూ కడ్తాదీ. తటీ ఆకూ రూఫ్ అవుతాదీ. తటీ మానూ ఆదా కాట్‌కె దొనె అవుతాది. దొనె తెల్డూ? నీలు పారి దొనె? తెల్సా! తటీ ఆకూ సాపా అవుతాది. బట్ట అవు తాది" (అప్పుడే ఏపక్క నుంచో హడా విడిగా (తెలుగు బాగా) వచ్చిన మేనే జరు) "బట్ట నైజీ బుట్టా" అంటే, గురుజీ "హాఁ! హాఁ! బుట్టా... ఫిర్ కుఁవాసే నీలు తటీ బకెట్ లాగ్‌తాదీ. తటీ నరా రస్సీ (రస్సీనై తాడూ) హాఁ హాఁ తడూ అవుతాది. తటీ నరా మేము ఫారిన్కి జహాజ్‌ల ఎగ్స్‌పార్టీ చేస్తాం... తటీ మంజా (మంజా నై ముంజె) హాఁ హాఁ ముంజి కానేకా చీజ్ తటీ బల్లెం (బల్లెం నై బెల్లం) హాఁ హాఁ బెల్లం తటీ పాన్కం, తటీ ఈగా (ఈగా నై తేగా) హాఁ హాఁ తేగా.... జౌర్ తటీ ఫల్... యేసబ్ కానేకా చీజ్ – మేము చెప్తం తిండిక్క తింటార్.

"తటీ ఫత్తర్ ఛత్తా అదీ గాడ్గు... హేఁ? పురుషమ్ పురాణ్ యితిహాస్ కలంమె తాటి ఫత్తర్ (ఫత్తర్‌నై 'రేకు' యా 'కమ్మ') హాఁ హాఁ. తటీ కమ్మ మే వేద్ పురాణ యితిహాస్ వుందీ. అత్‌మే తటీ మట్టా గిట్టా మికు పాయిలో కొయిలా – హేఁ? ఇన్నారా

తటీ చెట్టు జాస్తి వుప్ యోగమ్? అందుక్క అదీ కలప వృక్షమ్ (కలప నై జీ 'కల్ప') హాఁ హాఁ కల్ప వృక్షమ్.. తటీ చెట్టుకి బాగ్ సేస్తే మీ గ్రామ్ బాగ్ అవుతాది.. తటీ కల్ పీనా మత్! అది ఒంట్క్ సెడ్త. మత్మాగంధీ పొబెషన్, మొరార్బాయ్ ప్రొబెషన్... మీకూ తెల్సా దేశ్(య్)కి ఎంత పెరూ వుందీ ఫారిన్ మె?

"అఖర్ మె.. తడీ చెట్టూ పెద్ద చెయండీ, మి గ్రామ్ ప్రజ పెద్ద అవుతాదీ. సబ్ బోలో... జైతడీ! జై గంధీ! జై మొరా!"

కంపాలా నుంచి తెప్పించిన ఇంపాలా ఎక్కి దోపిడీలాల్ గారు అతి జరుగురుగా తిరుగు ముఖం పట్టేరు. కారులోంచే ప్రజలకి వంక దండాలు పెడుతూ

* * *

బికారీ మల్ గారి షష్టిపూర్తి 60 రోజుల పాటు ఏకనాదంగా జరుగు తూంది. అందులో ఒక రోజు తాటిచెట్ల నగర్ ప్రజలు కానుకలు పట్టుకుని వచ్చేరు. కానుకలన్నీ సదరు తాటి చెట్టు భాగాల్లోంచి పనివాడితనంగా చేసి నవే. సేఠ్జీ ఆ కానుకలన్నీ స్వయంగా పరిగ్రహించేరు. పరిగ్రహించి ఇతరులకి అర్ధంకాని వారి రామ్వాడీ భాషలో ఆ తాటి సరకునంతా కార్నిష్ బోయిలర్ లో పడేమని మేనెజర్జీకి చెప్పేరు! ఆ మాట లకి ఆ కానుకలని మ్యూజియంలో భద్ర పరస్తారనుకున్నారు, పాపం ప్రజలు. బికారీమల్జీ ప్రజని భవనంలోకి రమ్మ న్నాడు. ఆ భవనం చూస్తూవుంటే తాటి చెట్ల వాసులకి టాప్ లేచి పోతూంది. అమాయకంగా ప్రశ్నలు వేస్తున్నారు.

"ఇది ఏం టేబిల్ సార్?"

"ఇది మెహాగనీ టేబుల్. అమెరి కాలో ఓ మహాగని వుంది. ఆ గనిలో దొరికే కఱ్ఱ మెహాగనీ." (మేనేజరు)

"ఇదేంటి సార్ ఇంత చిన్న కోటు?"

"అది మిక్ కోటు. (దాని ఖరీదు పదివేలు). సేట్ గారి భార్యగారు తండీ కాలం రెండ్రోజులు మాత్రం తొడుగు తారు దాన్ని" మేనేజరు జవాబు.

మెహాగనీ, మింక్ కోట్, మార్బుల్ ఫ్లోరింగ్, అంతా అంతా అన్నీ ఆన్నీ మహా మహా ఖరీదు సామాన్లే కనపడు తున్నాయి, తాటి చెట్లనగర్ ప్రజలకి. వాళ్ళు ఎంత చూసినా దేని కోసం చూస్తున్నారో అది ఒక్కటీ కనపడ లేదు. చివరికి విసుగెత్తి దోపిడీ లాల్ గారినే డైరక్టుగా అడిగేరు.

"బాబూ తాడి చెట్టు బంగారం అన్నారు. కల్పవృక్షం అన్నారు. ఇంకెన్నో అన్నారు — ఈ భవంతిలో 'తాటి' ముచ్చుకైనా ఎందుకు లేదు?"

దోపిడీలాల్జీ తెల్లబోయినా లేనట్టు అతి చాకచక్యంగా నటించి...నవ్వి..

"హదీ సృష్టి మాయా మన చేతిలో ఏమ్లేదూ!

బొలో జై గంధీకి జై మొరార్కి!"

## కవితావేశం

జి. సి. జీవి

అర్ధరాత్రి మేలుకుని
అభ్యుదయ కవిత రాయాలని
ఆలోచించి ఆలోచించి
ఆవులింతలు తీస్తున్నప్పుడు
'అమ్మా ఆకలే' అనే
పక్క వాటాలోని
పసి పాప ఆక్రందన విని
నా కవితావేశం
విజృంభించ లేదు
చల్లారి పోయింది.

# దక్షిణాది భాషల్లో తొలి నవల

ఎ. బి. సాయిప్రసాద్

ఒక అవివేక శిఖామణి వింత చర్యలను ఉగ్గడించే సెర్వాన్‌టెస్ నవల డాన్ క్విక్‌సాట్ 17 వ శతాబ్దంలో, స్పెయిన్ దేశంలో జన్మించింది. కథా సంవిధానం, పాత్ర చిత్రణ, రసపోషణ కారణంగా డాన్ క్విక్ సాట్‌ను ప్రపంచ సాహిత్యంలో వెలువడిన మొదటి ప్రామాణిక నవలగా విమర్శకులు భావిస్తున్నారు. ఈ ప్రక్రియ వంద సంవత్సరాల తర్వాత బ్రిటన్‌లో ప్రవేశించింది. మొదటి నవల రాబిన్‌సన్ క్రూసోలోని క్రూసో ధైర్య సాహసాలకు ఈ రోజుకు కూడా ఒజ్జబంతిగా నిలిచే వ్యక్తి. ఈ పాత్ర సృష్టి కారణంగా (1719) నవలా రచయిత డేనియల్ డిఫో అమరుడైయ్యాడు. ఆ తర్వాత 150 ఏండ్లకు సముద్రాల ద్వారా యీ ముడిసరుకు, భారతదేశంలో ఆంగ్లేయుల పరిపాలన కారణంగా దిగుమతి అయింది. ఇంత దూరం ప్రయాణం చేసినా భారతీయ నవలల నడకలో అలసట ఎక్కడా కనపడదు. కారణం 'నవల' పదం భారతీయులకు కొత్తది కావచ్చునేమో కాని, ప్రక్రియ ఆశియా వాసులకు, ముఖ్యంగా భారతీయ సాహితీ స్రష్టలకు కొత్తది కాదు. కొందరు విమర్శకుల వుద్దేశ్యం ప్రకారం సుమారు వెయ్యి సంవత్సరాలకు పూర్వం నవల జపానులో తల యెత్తింది (స్ఫూర్తి శ్రీ వ్యాసం – నవల – ప్రధానాంగాలు – 'కిన్నెర' జనవరి 1955 నుండి).

సాధారణంగా చరిత్ర పుటలు వ్యక్తుల పేర్లతోనూ, సంఘటనలు జరిగిన తారీఖులతోనూ నిండి వుంటాయి. ఒక నానుడి ప్రకారం చరిత్రలో పేర్లు, తారీఖులు మాత్రమే నిజం అట. తతిమ్మావి కావట. ఈ వాదనను ఆధారంగా చేసుకుంటే ఒక కొత్త నిజం బయట పడుతుంది. అందరూ భావిస్తున్నట్టు తొలి ఆధునిక నవల వంగ దేశంలో జన్మించలేదు. తెలుగు గడ్డపై అది పురుడు పోసుకుంది. ''హిందువుల యాచారములు తెలుపు'' నవీన ప్రబంధం 'శ్రీ రంగ రాజుచరిత్ర'ను మనం మొదటి నవలగా పరిగణింప వచ్చును. 1872 వ సంవత్సరంలో వెలువడిన ''కేవలం గద్యాత్మక''మైన ఈ తెలుగు ప్రబంధాన్ని కర్నూలు మండలానికి డెప్యూటి కలెక్టరుగా పని చేసిన నరహరి గోపాల కృష్ణమ సెట్టి రచించారు. ఈ నవల వ్రాయడానికి ఆనాటి గవర్నర్ జనరల్ లార్డ్ మేయో (Lord Mayo) ప్రకటనే ముఖ్య కారణం. లార్డ్ మేయో – ''వంగ రాష్ట్ర జాతీయ జీవితమును గూర్చి యాంగ్లేయ పద్ధతిలో నుత్తమమైన నవల రచించిన వారికి ఒక బహుమతి నిచ్చుట తన యాశయమని'' ప్రకటించి వుండెను [శ్రీ రంగ రాజు చరిత్ర ఉపోద్ఘాతం (తెలుగు – 1872) – డా. బి. వి. కుటుంబరావు – ''ఆంధ్ర నవలా పరిణామం'' 144 వ పుట నుండి]. ఈ ప్రకటన వల్ల వంగదేశపు సాహిత్యకారులు లాభం పొందలేదు, కాని ఒక తెలుగువ్యక్తి – పరిపాలనా దక్షత గలిగిన–

వాడు లాభం పొందాడు. అందుకే తన నవలను రచయిత లార్డ్ మేయోకే అంకిత మిచ్చాడు.

కన్యాకుమారి మొదలు కాశ్మీరం వరకుగల విమర్శకులు భారతశంలోదే ప్రచురించబడిన తొలి స్వతంత్ర నవలగా 'దుర్గేశనందిని' (బంకిమ్ చంద్ర ఛటర్జీ)ని పేర్కొంటున్నారు. తమ భాషా పరిధిని దాటి బయటకి రాకపోవడం వల్ల ఇలాంటి పొరబాట్లు జరుగుతుంటాయి. బంగాలీలు ఆంగ్ల భాషా ప్రభావానికి అందరి కంటే ముందే ప్రభావితం అయారు కాబట్టి, వారి భాషలోనే మొదటి నవల ప్రచురింపబడి వుంటుందన్నదే వీరి భావన, ఆలోచన మరియు వూహ. ఈ ఊహాగానం కారణంగా తమ తమ భాషలలోని ప్రథమ ప్రయత్నాలను గురించి తర్కించారు. తమ చుట్టు ప్రక్కల నున్నవారిని కాని, ఆ సాహిత్యాల్ని గురించి కాని విమర్శకులు ఆలోచించ లేకపోయారు. ఆ కారణంగానే పొరబాటు పడడం జరుగుతున్నది. ఖచ్చితమైన తేదీలను నమోదు చేసిన పండితులు – డా॥ బి. వి. కుటుంబరావు, డా. అక్కిరాజు రమాపతిరావు, శ్రీ నార్ల వెంకటేశ్వరరావు తదితరులు – కూడా పరిశీలించి చూడక పోవడం నిజంగా శోచనీయమైన విషయం.

తమిళ్ నావల్ (నూరాండు వరలారుమ్ వళర్చియుం) గ్రంథ రచయితలు – శ్రీయుతులు పి. జి. సుందర రాజన్ (చిట్టి), యస్. శివపాద సుందరం – దుర్గేశనందిని ప్రచురణా కాలాన్ని 1865 గా పేర్కొన్నారు. కాని నార్ల వెంకటేశ్వరరావు తమ ఆంగ్ల పుస్తకం 'వీరేశలింగం'లో 'దుర్గేశనందిని' ప్రచురణా కాలాన్ని 1875గా అభివర్ణించారు. నార్లవారి మాటల్లో Chatterji serialised in 1875 his Durgesa Nandini in his literary journal Bangadarshan. అంతటితో ఆగక Three years later Veeresalingam began publishing his RajaSekhara Charitra (Page 51, 3rd Para) అని కూడా వ్రాసారు. నార్లవారు వ్రాసిన రెండవ వాక్యంలో నిజం వుంది. వారు నమోదు చేసిన తారీఖు నాడే రాజశేఖర చరిత్ర వ్రాయడం జరిగింది. ఈ తర్కం ఆధారంగానే నార్ల వీరేశలింగాన్ని భారతదేశపు రెండవ నవలా కారుడిగా స్తుతిస్తున్నారు. శ్రీయుతులు చిట్టి, శివపాద సుందరంలు పొరబాటుగా 1865 ను 1875 కు బదులుగా వాడి వుండ వచ్చును. ఏతావాతా తేలేదేమంటే బంకిమ్ చంద్ర ఛటర్జీ నవల 'దుర్గేశనందిని', 1875లోనే వెలువడిందన్నది. కాని తొలి తెలుగు నవల 1872లోనే ప్రచురింప బడినది [శ్రీ దాశరధి రంగాచార్య, సంక్రాంతి (17–10–79) ఆంధ్రప్రభ (వారపత్రిక)లో అచ్చయిన వ్యాసం – తెలుగు నవలలో సాంఘిక దృష్టి – లో శ్రీ రంగరాజు చరిత్రను తొలి అసమగ్ర నవలగా అభివర్ణించారు]. మద్రాసు ఫోర్ట్ సెంట్ జార్జి గజెట్ VOl - I - P. 23 Supplement, June 1873లో, ఈ నవలను గురించి ఇలా వ్రాసారు: This is apparently the first attempt ever made in this part of India. డా. బి. వి. కుటుంబరావు కేవలం తెలుగు నవలలను గురించి మాత్రమే చర్చించడం వల్ల, దక్షిణ భారత దేశమునకు సాంఘిక నవలా ప్రథమ

ప్రసిద్ధ ప్రయత్నమని కూడ జెప్ప నొప్పు నంటారు తమ [ఆంధ్ర నవలా పరిణామం, 145వ పుట, 7 & 8 లైన్లు] పరిశోధనా గ్రంథంలో.

బంకిమ్ చంద్రుని నవల దుర్గేశనందినికి కావలసిన ముడి సరకు సర్ వాల్టర్ స్కాట్ నవల 'ఐవాన్‌హో' సమకూర్చింది. కందుకూరి వారు ఆలివర్ గోల్డ్‌స్మిత్ నవల 'వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్' నుండి ప్రేరణ గ్రహించిన సంగతి అందరికి తెలిసిన విషయమే. వారే యీ నిజాన్ని వొప్పుకున్నారు. తొలి తమిళ నవలగా పరిగణింపబడుతున్న ప్రతాప మొదలియార్ చరిత్రమ్, సంస్కృత పంచతంత్ర కథలను, ఆంగ్లంలోని ఫేబుల్ నీతికథల బాణీని అనుసరించింది మలయాళంలో ప్రథమ నవల (సాంఘిక) ఇందు లేఖ బేకన్ ఫీల్డ్ శైలిచే ప్రభావితమైనది. కాని నరహరి గోపాలకృష్ణమసెట్టి నవల, అన్ని విధాలా స్వతంత్ర నవల. ఈ నవల సంస్కృతాంగ్ల మూలాధారములు లేనిదని డా. బి. వి. కుటుంబరావు తమ ఆంధ్ర నవలా పరిణామము (Page 121) లో నొక్కి వక్కాణించారు.

దక్షిణాది భాషలలో వెలువడిన ప్రథమ నవలగా శ్రీయుతులు చిట్టి, శివపాద సుందరంలు, మాయూరమ్ మాజి మున్సిఫ్‌గా పనిచేసిన యస్. వేదనాయకం పిళ్ళై రచన ప్రతాప మొదలియార్ చరిత్రంను అభివర్ణిస్తున్నారు. ఇక్కడ కూడా వారిరువురు తారీఖులను సరిగా ఆరాతీయలేదన్న సంగతి మనకు సులభంగా బోధపడుతున్నది. జాతీయ ప్రాచీన పత్ర భాండాగారం, ఎగ్మోర్, మద్రాసు (National Archives, Egmore, Madras-8)లోని రిజిస్టర్ ప్రకారం 1879, ఆగస్టు 23వ తేదీన 'ప్రతాప మొదలియార్ చరిత్రమ్' వెలుగును చూసింది. 1878 నాటికే రాజశేఖర చరిత్రం వెలువడింది. ఆ సంవత్సరంలోనే అనాటి ప్రముఖ పత్రిక 'ది హిందు'లో సమీక్ష అచ్చు అయింది: We may well say that Raja Sekhara marks an era in the annals of Telugu Literature. సహేతుకమైన ఈ కారణం వల్ల దక్షిణాది భాషల్లో వెలువడిన తొలి నవల తెలుగు నవలేనని నిస్సందేహంగా చెప్పవచ్చును. భారత దేశంలో వెలువడిన మొదటి నవలగా నరహరి గోపాల కృష్ణమసెట్టి శ్రీ రంగరాజు చరిత్రను పరిగణిస్తున్నాం కాబట్టి, ఆ తరువాత తెలుగులో వచ్చిన సంపూర్ణ నవలగా వీరేశలింగం పంతులుగారి రాజశేఖర చరిత్రనే గ్రహించాలి.

తెలుగు తరువాత దక్షిణాది భాషల్లో ముద్రితమైన రెండవ నవలగా వేదనాయకం పిళ్ళై రచన 'ప్రతాప మొదలియార్ చరిత్రమ్'ను పేర్కొనవచ్చును. మూడవ స్థానంలో మలయాళ, కన్నడ నవలలు నిలుస్తాయి. ఈ రెండు భాషలలోనూ ప్రథమ సాంఘిక నవలలు ఏకకాలంలో (1889లో) ప్రచురింపబడ్డాయి. మలయాళ సాహిత్య విమర్శకులు శ్రీయుతులు కె. యం. జార్జి, యం. పి. పాల్ శ్రీ చందూ మెనాన్ నవల 'ఇందు లేఖ'ను మొట్టమొదటి సాంఘిక నవలగా పరిగణిస్తున్నారు.

1889లోనే మొదటి కన్నడ కాదంబరి (నవల) 'ఇందిరాబాయి' ప్రచురింప బడింది. రచయిత శ్రీ గుల్వాడి వెంకట రాయరు దక్షిణ కెనరా జిల్లాలోని

బంట్వాళ, ముంజేశ్వర, మంగళూరు ప్రాంతాలలో పోలీసు ఇన్‌స్పెక్టర్‌గా పని చేసి పదవీ విరమణ చేసిన తరువాత రచనా వ్యాసంగాన్ని చేబట్టారు.

తమ తమ భాషలో మొదటి నవలను రచించిన రచయితలకు ప్రత్యక్షంగానో పరోక్షంగానో న్యాయశాఖతో పరిచయం వున్నది. రచయితల ఉద్దేశ్యం కూడా తమ భాషా సంస్కృతులకు రచన ద్వారా అద్దం పట్టాలన్నదే. తమకు పరిచయమున్న వాతావరణాన్ని, పరిసరాల్ని వారు ఎన్నుకున్నారు. కందుకూరి, గుల్వాడిలు బ్రాహ్మలగుటవల్ల బ్రాహ్మణ సమాజాన్ని, తమిళ, మలయాళీ రచయితలు అబ్రాహ్మలగుట వల్ల అబ్రాహ్మణ సమాజాన్ని చిత్రించారు. ఇది కేవలం యాదృచ్ఛికం.

## తారుమారు

### విజయచంద్ర

రాత్రి నా కలలో అంతా
తారుమారైంది
ప్రతీది క్రమం తప్పినట్టు అన్పించింది
ఒక పెద్ద ఎన్నికల సభ జరిగింది
నక్క, పులి, సింహం, తోడేలు
ప్రజాస్వామ్యాన్ని నిర్వచించాయి
ఎన్నికల్లో గెల్చి విదూషకుల పార్టీ
రాజ్యాధికారాన్ని స్వీకరించింది
సామాన్యుల జీవితం ఎలా ఉందో
పరిశీలించేందుకు
రోడ్ల మీద నడవసాగాను
గుడిసెలు, దోపిడీలు, భవంతులు
మరిన్ని పెరిగాయి
పూరిపాకలు ఏడుస్తుంటే
భవనాలు చిరునవ్వులు చిందిస్తున్నాయి
కొందరికి చిద్విలాసంగా ఉంది
మిగిలిన వారందరికీ దుఃఖంతో
భారంగా అన్పిస్తోంది
మార్కెట్లలో ఎక్కడా సామానులు లేవు
అన్ని దుఖాణాల్లోంచి మాయమై
ఆకాశంలో బెలూన్లలా ఎగురుతున్నాయి
జనం దిగాలుగా తలలెత్తి
ఆకాశం వైపు చూస్తున్నారు.
గాడిదలు బుస్కోట్లు ధరించాయి
నక్కలు టోపీలు పెట్టుకున్నాయి
ప్లిమత్ కారుల్లో పయనిస్తున్నాయి
తోడేళ్లు ట్వీడ్ సూట్లలో
ఆఫీసుల్ని ఎడ్మినిస్ట్రేట్ చేస్తున్నాయి
పార్లమెంట్ భవనం దగ్గర ఏదో
పెద గొడవ జరుగుతోంది.
లోపల నుంచి బిగ్గరగా కేకలు
జనం గుంపులు గుంపులుగా
మూగుతున్నారు
హోటళ్లలో రెస్టారెంట్లలో, క్యాంటీన్లలో
ప్రజలు ధరల పట్టీ చూస్తున్నారు
ప్లాట్ ఫారాల్లో, బస్టాండుల్లో,
విమానాశ్రయాల్లో
జనం ముఖాలు చిరాకుతో
ధుమ ధుమ లాడుతున్నాయి
ఇదంతా చూసి నాకు తలనొప్పొచ్చింది
ఆస్ప్రో మాత్ర కొనుక్కుందామని
మెడికల్ షాపు కెళ్లాను
ఆశ్చర్యం!
అక్కడ మూత్రం మాత్రమే
అమ్ముతున్నారు.
విసుగ్గా నా గదికి పోయి
దుప్పటి కప్పుకొని నిద్రపోయాను
తెల్లవారి లేచి చూసాను కదా
రాత్రి నా కలంతా నిజమే అన్పించింది

# మంచి మంచిని పెంచదు!

# చెడు చెడుని పెంచదు!

## మంథా వెంకట రమణారావు

"వ్వాటే డేమేజింగ్ స్టేట్ మెంట్! అని" అనుకోవద్దని మనవి!

మీరు మంచి మనస్సుతో ప్రతిఫలం కోరకుండా ఎవడికన్నా అవగింజంత మంచి చేసి చూడండి! ఆ మంచి మీ వల్ల పొందినవాడు మిమ్మల్ని ముఖం ముందు పొగిడినా వెనకాల తిట్టుకపోంతాడేమో? అంతే కాదు, ఓ సారి మంచి చేసేరా, అది వాడి జన్మ హక్కయినట్టుగా మిమ్మల్ని జలగలా పట్టుకొని, మీ మంచితన ద్వారా రాబట్టవల్సిందంతా రాబట్టి తరవాత మిమ్మల్ని వదిలి పెడతాడు.

వస్తు రూపేణా, డబ్బు రూపేణా ప్రతిఫలం కోరకుండా మీరు ఎందుకు మంచి చేస్తారు? మీరు మంచివారని పించుకుందామని మీ అహాన్ని తృప్తి పరచుకుందుకే కదా? అది అనువుగా తీసుకొని, మీకున్న ఉపకారం చెయ్యగల శక్తిని తమ మంచికోసం ఖర్చు పెట్టించేందుకు బెల్లం చుట్టు ఈగల్లా మూగి, బెల్లం అయిపోగానే మీ దరి దాపులకి రారు భట్రాజులు! పవరూ, పరపతీ, డబ్బు నిలవల వంటిదే – ఖర్చు పెడుతున్నకొద్దీ తరుగుతూ వెళ్తుంది – ఆ లోటు భర్తీ చేసుకుంటునే తప్ప మీకున్న పవర్, జీరో అవగానే మిమ్మల్ని గద్దెమీంచి కిందకి దించుతారు!

అందువల్ల, బాగుపడాలనుకొనేవాడు, ఒకే ప్రిన్సిపుల్ పెట్టుకుంటాడు. ఎవరన్నా సహాయం కోరితే, "గురూ! నేను నీకెందుకు సాయం చెయ్యాల?" అని అడుగుతాడు.

"అయ్యా! నాకు మీ సాయం కావాలి కాబట్టి, మీరు మంచి పనులు చేసే మంచి వారని విన్నాను కాబట్టి, మీరు నాకు సాయం చెయ్యాల!" అంటాడు వెకిలి నవ్వులు ఒలకబోస్తూ.

"చూడు నేస్తం! ఎందరెందరికో, ఎందరెందరి దగ్గరో అవసరాలు ఉంటూనే ఉంటాయి – నాకు ఎందరి దగ్గరో అవసరాలున్నాయి. వెళ్లి "నాకు సాయపడండి" అంటే సాయపడతాడా ఎవడన్నా? బిర్లా దగ్గర కోట్లు మూల్గుతున్నాయి. వెళ్లి అడుగుతే ఓ రూకన్న ఊరికే ఇస్తాడా? అంత కోటీశ్వరుడూ, 'తిరిగి నాకేమిస్తావ్?' అని చెయ్యి చాపుతాడు! నా దగ్గర రెండు రూకల పని రాబడితేనే కాని రూక జార్చడు! అందువల్ల నా సాయానికి బదులుగా నువ్వు నాకు తిరిగి ఏదో రూపంలో సాయపడగలిగినప్పుడే నా సాయం నీకు దొరుకుతుంది! అప్పుడే నువ్వు నన్ను గౌరవిస్తావ్! నువ్వు నాకు ముట్టజెప్పే ప్రతిఫలం బట్టి, నేను నీకు జేసే సాయం ఉంటుంది కాబట్టి 'ఫలనా వాడికి ఎక్కువ మంచి చేసేవు, నాకు తక్కువ సాయం చేసేవు' అని తెగనాడవు నన్ను అంటాడు!

మంచి పొందినవాడు, తిరిగి అవసరం పడ్డవరకూ, మంచిచేసిన వాడికి మోహం చూపడు. ఎందువల్లనంటే ఎదురుపడేగానే, ఉపకారం చేసినవాడి ఎక్కువతనం, తన తక్కువ తనం,

కృతజ్ఞత నిరంతరం చూపించుకో వాలన్న సంగతి గుర్తుకు వస్తుంది! అందువల్ల తిరుగుబాటు ధోరణి పెంచు కొని, ఉపకారం చేసినవాడి లోపాలు ఎంచి, ఇతరులకు ఎత్తిచూపి వెనుక పాటున అపప్రచారం చేసి, తద్వారా అతడేం అధికుడు కాదు అన్నభావాన్ని తన మనసులో పెంచుకో జూస్తాడు. ఉపకారం చేసేవాడే వెంటనే ప్రతి ఫలం పుచ్చేసుకుంటే, ఉపకారం పొందిన వాడిలో తను తక్కువ వాడి ననే భావం ఉండదు!

మంచి వాడని పించుకుందామనే రాముడ్ని అడవులకు పంపలేదా కైక? బంగారు లేడిని తెచ్చి సీత చేత మంచి వాడని పించుకుందామని రాముడు సీతని పోగొట్టుకున్నాడు. లోకానికి మంచి చేద్దామనుకున్న క్రీస్తుని శిలువ ఎక్కించేరు. సోక్రటీస్‌కి విషం ఇచ్చి చంపేరు. గాంధీ కూనీ చెయ్యబడ్డాడు. మంచివాడి ననిపించుకుందామనుకున్న కర్ణుడు సర్వశక్తులూ పోగొట్టుకున్నాడు.

మంచివాడి చేతికే పవర్ వస్తే, ఆ పవర్‌ని వాడి చుట్టూ ఉన్న చెడ్డవాళ్లు తమ బాగుకోసం దురుపయోగ పరుచు కుంటున్నారే తప్ప, ఆ మంచి వాడు, నిజంగా మంచి వాళ్లకి ఏ మంచి చెయ్యలేకపోతున్నాడు!

కాబట్టి, మంచి మంచిని పెంచదు!

ఇంక రెండో స్టేట్‌మెంట్ ... "చెడు ... చెడుని పెంచదు!" అన్న దాన్ని పరిశీలిద్దాం.

ఓ చెడ్డ వాడి చేతిలో పవర్ ఉంటే అతడు అందర్నీ ఏడు చెరువుల నీళ్లు తాగిస్తున్నాడు! ఏ పని చేసినా వీడు మంచి వాడు వీడు చెడ్డవాడు అన్నభేదం లేకుండా అందర్నీ ఒకే దృష్టితో చూస్తాడు. తనకున్న పవర్‌ని నిలబెట్టు కుందుకీ, ఎక్కువ చేసుకుందుకీ వాడు అందరినీ తన పనిముట్టుగానూ, సాధన సంపత్తిగానూ వాడుకుంటాడు.

అందువల్ల చెడ్డ వాడు నిరంకుశంగా అధికారం చెలాయిస్తున్నంత కాలం, చెడ్డవాళ్లు కూడా మంచి వాళ్లుగా మారి పోతారు — దొంగ దొంగతనం చెయ్యడు — చేస్తే చేతులు నరక బడతాయి. రేపిస్ట్ రేప్ చెయ్యడు — చేస్తే నడి బజారులో తుపాకితో కాల్చ బడతాడు. అబద్ధాలు గుక్కకి వెయ్యీ, జివ్వకి వెయ్యీ ఆడేవాడు ఒక్క అబద్ధం ఆడేందుకన్నా జంకుతాడు. దొరుకుతే నాలిక తెగుతుంది. దుష్టులంతా మంచి వాళ్లన్న బురఖాలు తగుల్చుకొని, మంచి వారితో కలిసిమెలిసి తిరుగుతారు.

దేర్‌ఫోర్ సాధు సన్యాసులు రాజ్యం ఏలడానికీ, అధికారం చెలా యించడానికి పనికిరారు. వాళ్లు పవర్‌కి వచ్చినా నిరంకుశులుగా మారతారు. మారనప్పుడు చస్తారు!

ఒక నిరంకుశుడు గద్దె మీద కూచుంటే దుర్మార్గపు పౌరులు గజగజ లాడతారు! మంచివారు గజగజ లాడరు! కాని ఓ సాధువు పవర్‌లోకి వచ్చి సాధువుగానే ఉంటే, ప్రతి దుర్మార్గుడూ రాజ్యంలో ఓ నిరంకు శుడిగా మారి మంచి ప్రజలని పీడించుక తింటాడు.

కాబట్టి మంచిని పెంచడానికి చెడు కున్నంత శక్తి మంచికి లేదు!

చెడుని పెంచడానికి మంచికున్నంత శక్తి చెడుకి లేదు!

ఈ రెండు పాయింట్ల గురించీ ఇంకా ఇంకా రాయొచ్చు. అంతా నే రాయడం కన్న మీ ఆలోచనకే వదిలేయడం న్యాయం!

# వ్యావహారిక భాషోద్యమ పితామహుడు 'గిడుగు'

## డా॥ పోరంకి దక్షిణామూర్తి

భాషంటే మాట్లాడేది. మాట ముందు పుట్టి, తరవాత్తరవాత రాతకెక్కింది భాష, బతికున్న వాళ్ళ నోళ్ళలోనే బతుకుతుంది. మరి రాతలో బతకదా అంటే, ఒక్క రాతలోనే మిగిలి పోయింది బతికున్నట్టు ఎలా అవుతుంది? బతకడ మంటే మ్యూజియంలో ఓ మూల, అద్దాల పెట్టిలో పడి వుండడం కాదు. ఆరుబయట హాయిగా గాలి పీల్చుకుంటూ వెల్తురు నింపుకుంటూ ఉండడం, నాడి ఆడుతూ ఉండడం. అందుచేత, కొన్ని జీవరాశుల్లాగే కొన్ని భాషలు కూడా అయిపూ మచ్చా లేకుండా అడుగంటి పోవడం వింటుంటాం. ఇది చాలా సహజం. ఇందులో బాధ పడవలసిందీ, పడి చెయ్యగలిగిందీ ఏం లేదు.

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, భాషంటే వ్యావహారికమే కాని మరొకటి కాదు. అంటే జనం నోళ్ళలో ఉన్నదేనన్నమాట. అల్లాగయితే వ్యావహారక భాష అనడ మెందుకూ అనొచ్చు. ఇక్కడ, వ్యావహారిక మన్నది, భాషకి విశేషణం. అంటే. మరో రకంది కూడా భాషగా చెలామణి అవుతోందన్న సంగతి తెలుస్తోంది. ఆ మాట కొస్తే అసలు భాషంటే ఆ మరో రకందే కాని జనం నోళ్ళలో ఉన్నది కాదని కొందరు యద్దేవా చెయ్యబట్టే, దీనికి ఈ విశేషణం తగిలించ వలసి వచ్చింది. తగిలించడమే కాదు – హోరాహోరీగా పోట్లాడ వలసి వచ్చింది. ఎన్ని విమర్శలు, ఎన్ని వాగ్యుద్ధాలు! ఎంత రచ్చ జరిగిందనీ! వాటినన్నింటినీ ఎదిరించి నిలబడి, వాటి వేలితోనే వాటి కన్ను పొడిచి, పొరలు విడిపించి, చూపు తెప్పించటానికి అహోరాత్రా లేమిటి – అనుక్షణం పనిచేసి జనంలో బతికే మాటకి మాట పడిపోకుండా నిలిపి, మాట దక్కించిన మహానుభావుడు – గిడుగు రామ్మూర్తి పంతులు. అందుకే ఆయన వ్యావహారిక భాషా పితామహుడయారు. తెలుగువాడు చల్లటి వేళ తలుచుకోవలసిన వాడయాడు.

తలుచు కోవడమంటే గుర్తొస్తోంది - రామ్మూర్తి పంతులు గారు కాలంచేసి సరిగ్గా ఇరవై తొమ్మిదేళ్ళ యిందిప్పటికి – సరిగ్గా జనవరి నెల్లోలోనే. 'అయ్యో! రామూర్తి పంతులు గారు పోయారా! ఇహ నెల్లాగ' అని వాపోయారు కొందరు. మరో వారం రోజులకి కన్ను మూస్తారనగా, ఆయన మద్రాసులో కొంతమంది స్నేహితులు ఏర్పాటు చేసిన చిన్న సమావేశంలో మాట్లాడ్డమే ఆయన ఆఖరి ప్రసంగం. అప్పటికి 30ఏళ్ళుగా తాము సాగిస్తూ వచ్చిన వ్యావహారిక భాషోద్యమం వేరూని బాగా పెరిగినందుకు తృప్తిపడ్డారు. ఆధునిక భాషకి అర్హమైన స్థానమిచ్చి జనంలో బాగా వ్యాప్తి చేస్తున్నందుకు పత్రికారచయితల్ని అభినందించారు. విశ్వవిద్యాలయాలు ప్రభుత్వమూ కూడా దీనికి గుర్తింపు ఇవ్వడానికి కావలసిన ప్రయ

త్నాలు చెయ్యాలని ఉద్బోధించారు. ఆయన చేసిన ఆఖరి ప్రసంగం, ఆయన పోయిన రోజునే ఒక పత్రికలో అచ్చయి వచ్చింది.

'మళ్ళీ ఎన్ని శతాబ్దాలకో కదా అల్లాటి వ్యక్తి ఆంధ్రదేశంలో పుట్టడం!' అని అనిపించు కున్నవాడు రామ్మూర్తి పంతులు గారు. ఆయన బుద్ధి నిశితమయినది. మనస్సు వెన్నలాంటిది. భాషా శాస్త్ర పరిజ్ఞానం అపారమయింది. పాండిత్యం గాఢమైంది. పట్టుదల సాటిలేనిది. లేకపోతే, ఆరోగ్యాన్ని కూడా ఖాతరు చెయ్య కుండా మన్యప్రాంతలో పర్యటించి సవరల భాష నేర్చుకుని దానికో వ్యాకరణం రాసిపెట్టి, నిఘంటు నిర్మాణానికి కావలసిన సరంజామా అంతా పోగుచేసి తెచ్చిన తెలుగు వాళ్లలో మొట్టమొదటి ఆధునిక భాషా శాస్త్రవేత్తగా మన్ననలెలా అందు కుంటాడు ? మాటలే ఆయన కూడ బెట్టిన మూటలు. అవుంటే తిండి తిప్పలూ అక్కర్లేదు. డబ్బు లక్ష్యం అసలే లేదు. పైపెచ్చు ఎంతో నష్టపోయారు. పర్లాకిమి డిలో మాష్టరుగా పనిచేస్తూ అక్కడి రాజుగారితో మాట పట్టింపువచ్చి, అక్కడున్న ఇల్లే కాదు, ఆ వూరూ ఆ దేశం కూడా చూడనని ఒట్టేసుకుని వచ్చేశారు. ఎంత పట్టుదల మనిషయినా, మామూలప్పుడైతే అంత పట్టింపు వుండక పోను. అసలేం జరిగిందంటే, బ్రిటిష్ వాళ్ళు ఒరిస్సా వాళ్ళకి ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటు చేసే సందర్భంలో, ఈ పర్లాకిమిడి రాజా గారు ఒరియావాడు కనుక - తన ప్రాంతాన్ని కూడా ఒరిస్సాలోనే చేర్చుకోవాలన్న పట్టుమీద ఉన్నాడు. జనంలో ఎక్కువ మంది తెలుగువాళ్లే కనక అది తెలుగు దేశంలోనే ఉండాలని రామ్మూర్తిగారి వాదం. రాజు తలచుకుంటే దెబ్బలకొక్కదవా, అన్నట్టయింది, చివరికి. రామ్మూర్తి పంతులు గారిది భరించలేకపోయారు. వెంటనే అక్కణ్ణించి మకామెత్తేసి రాజమండ్రి వచ్చే శారు. అప్పట్నించీ పూర్తిగా తెలుక్కే అంకితమై పోయారు. ఒక్క తెలుగులో అన్నమాటేమిటి ? ఆర్య ద్రావిడ భాషా కుటుంబాలు రెండింటి తులనాత్మక భాషా శాస్త్రాలూ ఆయనకి కొట్టిన పిండి. మాక్స్ముల్లర్, సైస్, కాల్డ్‌వెల్ రాసిన గ్రంథాలు క్షుణ్ణంగా చదివారు ఇంగ్లీషు వ్యాకరణం, ఇంగీషు భాషా చరిత్రా బాగా చదివారు. డేనియల్ జోన్స్ లాంటి ప్రఖ్యాత భాషా శాస్త్ర వేత్తలతో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపారు. సంస్కృతంలో మంచి పాండిత్య ముంది. ముండారీ భాషా కుటుంబీకులైన సవరలనే ఆదివాసుల భాషను ఉద్ధరించ డమే కాకుండా, వాళ్ళను గురించి ఈయన రాసిన వాటిని, థర్‌స్టన్, 'కేస్ట్స్ అండ్ ట్రైబ్స్' అన్న గ్రంథంలో ఉదాహరించడం కూడా జరిగింది. ముఖలింగంలో ఈయన జరిపిన చారిత్రక పరిశీలనలు, కళింగ దేశంలో గాంగవంశం వాళ్ళ చరిత్ర తెలుసుకోడానికి ఎంతో తోడ్పడ్డాయి. కొన్ని ప్రాచీన శాసనాల్ని చదివి, వాటిని గురించి కొన్ని వ్యాసాలు రాశారు. 1894లో 'ఎపిగ్రాఫికా ఇండికా' నాలుగో సంపుటంలో అచ్చయ్యాయివి. ఇంత బహుముఖ పాండిత్యం, ప్రతిభ, ఒక వ్యక్తిలో కనిపించడం చాలా అరుదు అంత పెద్దరామ్మూర్తి పంతులుగారు చూసి చూసి ఈ తెలుగు రొంపిలో పడ్డారేమిటి చెప్మా అన్నావాళ్ళూ ఉన్నారు. అదీ మన మంచికే అయిందను కున్నవాళ్ళూ ఉన్నారు. ఆయన తెలుకోసం నడుం కట్టాడంటే, రొంపిలో కూరుకు పోయిన దాన్ని ఉద్ధరించడానికే. తెలుగు

దేశంలో నవశకోదయానికి నాంది పలకడానికే! అందుకు పెద్ద యెత్తున ఉద్యమమే నడప వలసి వచ్చింది. దేశంలో నలుమూలలకీ తిరిగీ, పాత కాలపు తాటాకు పుస్తకాలు సేకరించీ, సభల్లో ఉపన్యాసాలిచ్చి, వ్యాసాలు రాసీ, హేమా హేమీలతో ఢీకొనీ, గిడుగ్కాదురా బాబూ నెత్తిమీద పిడుగే అనిపించు కున్నాడు. ఇంత హైరాణ పడ్డానికి కారణం కూడా ఉంది.

ఏమయిందంటే - జె. ఎ. యేట్స్ అనే ఇంగ్లీషువాడు, మద్రాస్ ప్రెసిడెన్సీలో ఉత్తర జిల్లాలకి స్కూళ్ళినస్పెక్టరుగా ఉండేవాడు. ఆయన రామ్మూర్తి గారిని ఆహ్వానించి భాషల పుట్టు పూర్వోత్తరాల గురించీ, ముఖ్యంగా తెలుగు భాష గురించీ, టీచర్ల కోసం పండితుల కోసం ఏర్పాటు చేసిన వార్షిక సమావేశంలో ఉపన్యాస మిప్పించాడు. అప్పుడు రామ్మూర్తి పంతులు గారిచ్చిన ఉపన్యాసం విని పండితులు తారెత్తి పోయారు. ఆయన ఉద్దేశాల్నే శంకించారు.

సరిగా ఈ రోజుల్లోనే విద్యావిధానంలో పెద్ద మార్పొకటి వచ్చింది. మెట్రిక్యులేషన్ పోయి స్కూల్ ఫైనల్ పరీక్ష వచ్చింది. ఎఫ్. ఎ. పోయి ఇంటర్మీడియట్ వచ్చింది. సబ్జెక్టుల్లో కూడా సమూలమయిన మార్పులు వచ్చాయి. దేశభాషల్లోకి అనువాదాలు చెయ్యడం, వ్యాసరచన చెయ్యడం నిర్బంధంగా విధించడం జరిగింది. వీటికి అనువైన భాష, జీవంతమయిన వ్యావహారిక భాష కాని పాత కాలపు కావ్య భాష కాదని ఆధునిక భాషోద్యమ కర్తల అభిప్రాయం.

పండితుల సమావేశంలో కూడా రామ్మూర్తి పంతులు గారు ఈ సంగతి నొక్కి చెప్పారు. ఇంగ్లీషులో ఛాసర్, స్పెన్సర్, షేక్స్పియర్, మిల్టన్ లాంటి పాతకాలపు కవుల రచనలు కూడా విద్యార్థులకి చెబుతారు. కాని, ఆ కవుల గురించి కాని, వాళ్ళ కావ్యాల గురించి కాని చెప్పేటప్పుడూ రాయవలసి నప్పుడూ ఆ పాత కాలపు భాష ఎవరూ ఉపయోగించరు. ఏ కాలంలో బతికేవాళ్లు ఆ కాలంలో మాట్లాడే శిష్ట భాషలోనే రాస్తారు. ప్రపంచంలో అన్ని దేశాల్లోనూ ఈ మాదిరిగా ఉండగా తెలుగులో ఎందుకుండ గూడదో అర్థం కాదు. ప్రపంచంలో ముందు పుట్టింది మాటే కనక, రాత దాన్ని అనుసరించే ఉండాలి. ప్రపంచంలో అన్నిట్లోనూ మార్పు వచ్చినట్టే భాషలోనూ వస్తుంది ఇది చాలా సహజం. ఈ సంగతి గమనించకుండా, పాత అలవాట్ల ప్రకారమే రాస్తూ వుంటే మాట్లాడే భాషకీ రాసే భాషకీ అంతరం ఎక్కువైపోయి రెండూ వేరే వేరే భాషలనిపించే సితి ఏర్పడుతుంది. ఇతర దేశాల్లో, ఈ దుఃస్థితి రాకుండా జాగ్రత్త పడ్డారు. మనమూ జాగ్రత్త పడాలి అంటూ నచ్చజెప్పటానికి ప్రయత్నించారు. పి. టి. శ్రీనివాస అయ్యంగారు, 'లాంగ్వేజ్ః లైఫ్ అండ్ డెత్' అన్న కరపత్రం ఒకటి ప్రకటిస్తూ భాష సాధారణ నియమాల్ని వివరిస్తూ విదేశ పండితులు చెప్పిన విషయాలెన్నో ఉదాహరించారు. అది పాత కాలపు పండితులకి నచ్చలేదు. పైగా, 1911లో స్కూల్ ఫైనల్ పరీక్షకి వెళ్ళే విద్యార్థులకి, సెట్టి లక్ష్మీనరసింహం గారు రాసిన 'గ్రీకు మిత్రులు' పాఠ్య గ్రంథంగా పెడితే, దాన్ని తీయించేదాకా నిద్రపోమని పండితులు పట్టు బట్టారు. అందులో భాష, గ్రామ్యం కానే కాదు. దేశంలో వాడుకలో ఉన్న పదాలూ పదబంధాలూ కొన్ని ఉన్నాయంతే. మొత్తం మీద వాడుక

భాషని నిరసించడానికి పెద్ద ఉద్యమం బలుద్దేరదీశారు. వేలకొద్దీ సంతకాలు సేకరించి ప్రభుత్వానికి మహజర్లు పంపుకున్నారు. సభలు పెట్టారు. పత్రికల్లో విమర్శలు రాశారు. కర పత్రాలు వేశారు.

ఈ గొడవ తేల్చడం కోసం మద్రాసు విశ్వవిద్యాలయం వాళ్ళు 1911లో ఒక సంఘాన్ని నియమించారు. అందులో వ్యావహారిక భాష వాళ్ళు నలుగురు, గ్రాంథికం వాళ్ళు నలుగురు. ఒక తటస్థుడు. మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో ప్రొఫెసరుగా ఉండే ఎం. రంగాచార్యగారు అధ్యక్షుడు. ఆ కమిటీ వాళ్ళు ఆధునిక భాషకి అనుకూలంగా తీర్మానించారు. కావ్యభాషాభిమానులకది దుర్భర మయింది. అందుచేత, ఈ తీర్మానాన్ని ఎల్లాగయినా అమలు జరక్కుండా చెయ్యాలని, మరో ఎత్తు ఎత్తారు. విద్యా విషయాల్లో కూడా రాజకీయాలు ప్రవేశ పెట్టకపోతే పాచిక పారదని కాబోలు, కమిటీ సభ్యుల సంఖ్య పెంచాలని పట్టుబట్టి, అందులో తమకి అనుకూలమైన వాళ్ళని వేయించుకుని, అనుకూలంగా తీర్మానాలు చేయించుకున్నారు. దాంతో కథ మళ్ళీ మొదటి కొచ్చింది. దీనికి అనంగీకారం తెలుపుతూ, కమిటీ సభ్యులైన గురజాడ అప్పారావుగారు ఒక 'డిసెంట్ పత్రం' రాసిచ్చారు. ఐతేనేం, ఆధునిక భాషని బయటికి నెట్టేసి తలుపులు బిడాయించు కున్నాయి విద్యాలయాలు.

అయినా రామ్మూర్తి పంతులుగారు నిస్పృహ చెందలేదు. తన వాదం సత్యనిష్ఠమైందని ఆయనకి స్పష్టంగా తెలుసు. చెవినిల్లుకట్టుకుని పోరితే తప్ప పది మందికీ తల కెక్కదని కూడా తెలుసు. అంచేత ఉద్యమాన్ని ఇంకా పట్టుదలలో నడిపించారు. చిన్నప్పటి చెలికాడు, అప్పారావు గారు లేకపోయె! 1915 లోనే ఆయన కన్ను మూశారు. నలుగురిలో రొష్టుపడ్డా, మెప్పు పొందినా భరించ వలసి వచ్చింది తనొక్కడే.

మార్పన్నది భాషకి సహజం. జీవద్భాషకి మరీను. వ్యాకరణ బద్ధమైందనీ, శుద్ధమైందనీ, ప్రాచీన సంప్రదాయానుగుణమైందనీ కొందరు పండితులు చెప్పే కావ్య భాష కూడా మార్పులకి చేర్పులకి లోనవుతూనే వచ్చిందని ఆయన

## మాతృభూమీ!

రష్యన్ కవిత :
డేవిడ్
కుగుల్తినోవ్
అనువాదం :
చల్లా
రాధాకృష్ణశర్మ

ఓ మాతృ భూమీ!
ఇలా నిన్ను
యుగ యుగాలుగా
పిలుస్తున్నారు
ఆదర పూర్వకంగా
నీవే పోశావు జీవం
ప్రసాదించావు
బలం ఆరోగ్యం
చేయి పుచ్చుకుని
చూపించావు మార్గం.
మాతృమూర్తిలా
అవధు లెరుగవు నీవు
తల్లివే కాదు నీవు
తనూజవు కూడా!
త్వరితగతిని పయనించే
ఈ ఐహిక జీవితం నుంచి
నీకు సమర్పిస్తున్నాము
మా సర్వస్వం
నిస్వార్థంగా,
సంతానానికి ఇచ్చినట్లు,
ఇక్కడున్నవన్నీ నావే
ఇవి స్వీకరించి వర్ధిల్లు,
విస్తరిల్లు
ప్రియ జననీ, తనూజా
ఓ నా మాతృభూమీ!

వచ్చిందని ఆయన నిరూపించారు. పండితులు ఏ రూపాల్ని ఈసడిస్తూ వచ్చారో, వాటినే వాళ్ళ రచనల్లోనే ఎత్తి చూపించారు. వాళ్లు నెత్తిన పెట్టుకునే పూర్వ కవులు కూడా వాటిని ప్రయోగించిన వాళ్లున్నారనడానికి దాఖలాలు చూపించారు. పాత కాలపు తాటాకు పుస్తకాలు ఎక్కడెక్కణ్ణించో పోగు చేసి వాటిలో ప్రమాణాలు కళ్ళకక్కట్టేట్టు చేశారు.

అయినా కొందరు పండితుల తలకెక్కేది కాదు ఆయన వాదం. నిజానికి చెముడు వచ్చింది రామ్మూర్తి పంతులుగారికి కాదు. ఆ కాలపు మొండి పండితులకే. క్రమంగా ఆయన వాదాన్ని అర్థం చేసుకున్న మహామహులూ ఉన్నారు. ఓసారి కొవ్వూరులో ఒక సభ జరిగిందట. వ్యావహారిక భాష గురించి రామ్మూర్తిగారి ఉపన్యాసం జరుగుతోంది. వీరేశలింగం పంతులుగారు వచ్చి దూరంగా నించుని ఆ ఉపన్యాసం శ్రద్ధగా విన్నారు. ఆయన వాదం సబబైందేనని గ్రహించడమే కాదు, తరువాత రామ్మూర్తి పంతులు గారు పెట్టిన వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజానికి మొట్ట మొదటి అధ్యక్షులుగా ఉండడానికి ఒప్పుకుంటూ దగ్గరికి వచ్చారు. ఆధునిక భాషకొక వ్యాకరణం రాయడానికి కూడా సిద్ధపడ్డారు. ఇది జరిగింది 1919 ఫిబ్రవరిలో. కాని మరో మూణ్ణెల్లలో ఆయన కన్ను మూశారు.

ఆ తరువాత 20 ఏళ్ళలో దేశంలో ఎన్నో మార్పులు వచ్చాయి. రామ్మూర్తి పంతులుగారి వాదం బాగా బలపడింది. పత్రికల సంఖ్య పెరిగింది. రచయితలూ పాఠకులూ పెరిగారు. రాజకీయ, సామాజిక చైతన్యం అపూర్వంగా పెరిగింది. ఇందుకు ప్రధానోపకరణం అయింది వాడుక భాషే కాని కావ్యభాష కాదు. ఒక వ్యక్తి, తను సాగించిన ఉద్యమం తన జీవిత కాలంలోనే ఫలించగా చూసుకోవడం ఎంత అదృష్టం! అప్పారావు గారికది లేకపోయింది, రామ్మూర్తి గారికి దక్కింది.

అయ్యో! ఆయన లేకపోయారే అన్న బెంగ ఇప్పుడక్కర్లేదు. వ్యావహారిక భాషోద్యమం చరిత్రలో ఎప్పుడూ వెలుగుతుండే అఖండం, గిడుగు రామ్మూర్తి పంతులు గారు!

---

# పురిటి గది

ఆ గదంతా పురిటి కంపు కొడ్తోంది. అబ్బ! దగ్గరకే వెళ్లలేక పోయాను. గదిలో పదుల సంఖ్యలో మంత్ర సానులు అహోరాత్రాలు కాన్పులు చేయిస్తున్నారు. డబ్బైఐదు భోషాణాలు, ముప్పై ఏళ్లగా పిల్లల మీద పిల్లలు ఒకే వరసన డబ్బు పిల్లల్ని కంటున్నాయి. ఏమిటిది? స్టెరిలైజేషన్ ఆపరేషన్ చేయించరూ అని అడిగాను. గది ముందు కాపలా కాస్తున్న ఎర్ర టోపీ, సంకెళ్ళు, జైలు నా వైపు గుర్రుగా చూసాయి.

---

విజయచంద్ర

---

# గిడ్డంగి

నీ వలె పుణ్యం చేసిన వారెవరీ దేశంలో
ఓ గిడ్డంగీ ?
ప్రభుత్వం కొన్న ధాన్యం
అమ్ముడుపోని విశ్వవిద్యాలయ ప్రచురణలు
చీకటి బజారు సరుకు
దొంగ రవాణా ఎల్. ఎస్. డి. . . . . హాషీష్
అన్నిటి ఆశ్రయ స్థానమా ? !
ఎవరికి లేకున్నా నీకన్నీ వున్నాయి —
ధాన్యం, పప్పు, బెల్లం !
ఆకలి కడుపులు మాడినా
నీ కుక్షి మాత్రం నిక్షేపం
ఆకలిగొన్న వారి కోసం పొర్లిపోతే
సదా భర్తీగా వుండే నీ కీర్తికే లోటు
చీమలు తిన్నా ఎలుకలు తిన్నా పంది కొక్కులు తిన్నా
రెండు జానల
ప్రాకే పందికొక్కు తిన్నా
ఎనిమిది జానల
నడయాడే పందికొక్కు తిన్నా
ఆకలిగొన్న వాడు మాత్రం తినకుంటే చాలు
వాడికి చావొచ్చినా సరే !
గిడ్డంగ్గి పొంగి పొరలుతుంటే చాలదా ?
దాంటో ధాన్యం క్షుద్బాధితుల కందితీరాలనే చట్టమెక్కడుంది ?
నిల్వ చేసిన ధాన్యాన్ని కోట్లాది క్షుదార్తులు
తిని బూదిచేస్తే ఎవరికి లాభం ?
ఎన్నికల వాయిదా అమలు పరచాలా ?
అయినా నీవంటి పుణ్యాత్ములు ఈ దేశంలో లేరు
ఓ గిడ్డంగి
అందరి పొట్టలకు, తలలకు కావలసిన
అన్నింటి ఆశ్రయ స్థానమా !

---

కన్నడ మూలం: తెనుగు సేత :

సిద్ధయ్య పురాణిక్ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

# ఉర్దూ మహాకవి హాలీ

## ఎం. ఏ. రహ్మాన్

ఉర్దూ సాహిత్యంలో వో గొప్ప మార్పు పేరే హాలీ. ఈయన పూర్తి పేరు ఖాజా అల్తాఫ్ హుసేన్. హాలీ కలం పేరు.

హాలీకి పూర్వం ఉర్దూ కవిత్వమంతా ప్రణయంలో ఓలలాడుతూండేది. లేకపోతే భక్తివాదం వుండేది. ప్రణయమంటే తెలుగువారి ప్రబంధ శృంగారంలా అంగాంగ వర్ణన మాత్రం కాదు. అశరీర ప్రణయం ఉర్దూవారికి కొత్తది కాదు. ఉర్దూకవుల దృష్టి ప్రియురాలి ముఖాన్ని దాటి ఎప్పుడూ క్రిందికి పోలేదు. ఇంకో చిత్రమేమంటే ప్రియుడూ, ప్రియురాలూ; రెంటికీ 'మహబూబ్' అనే పదాన్నే వాడతారు. ఇది పుల్లింగ పదం కాబట్టి ఒకే భావం, ఒకేసారి ప్రణయ పరంగానూ, దైవ పరంగానూ ద్వంద్వార్థాలు స్ఫురింపించే విధంగా వాళ్ళు రాయగలిగారు. హాలీ, సాహిత్యమంతా భక్తి, ప్రణయమయంగా ఉన్న రోజుల్లో రంగప్రవేశం చేశాడు.

ఇతడు క్రీ. శ. 1837లో పానిపట్టులో జన్మించాడు. చిన్నప్పుడే తండ్రిని కోల్పోయాడు. తల్లి రోగిష్టి. అన్నల ప్రాపకంలో పెరిగాడు. వాళ్ళుకూడా చిన్నప్పుడే పెళ్ళిజేసి తమ బాధ్యతలు తీర్చుకున్నారు. ఈయనలోని జ్ఞాన తృష్ణకు బాధ్యతలూ, లేమిడీ ఆటంకాలయ్యాయి. అయినా దేశంలోని వివిధప్రాంతాలు సందర్శించాడు. చిన్నచిన్న వుద్యోగాలు చేశాడు. ఢిల్లీలో వున్నప్పుడు అరబీ భాషలో మత సంబంధమైనదో చిన్న పుస్తకాన్ని రాశాడు. అది చిన్నదైనా వో మహాకవి ప్రారంభ కృషి.

హాలీ పేరెత్తగానే గదర్ తిరుగుబాటు, సామాజిక మార్పులు, సర్ సయ్యద్ వుద్యమం, ఇంగ్లీషు వెల్లువ, ఇవన్నీ మనకు గుర్తుకొస్తాయి. ఇవన్నీ ఈయనపై తమ ప్రభావాన్ని చూపెట్టాయి. లాహోరులో ఆజాద్, హాలర్ రాయిడ్‌ల ప్రభావం కూడా ఈయన పై బడింది. ఆంగ్లభాషతో ఏర్పడిన పరిచయ ఫలితంగా పాశ్చాత్య ప్రభావం కూడా పడింది.

తిరుగుబాటులూ, వుద్యమాల్లోంచి ఒక వస్తువుగానే హాలీని పేర్కొంటారు కొందరు. కాని పరిస్థితుల ప్రభావానికి లోనుకాని వారు మాత్రమెవరుంటారు? అయితే ఒకే పరిస్థితులు వేర్వేరు వ్యక్తుల్ని వేరు వేరు విధంగా ప్రభావితుల్ని చేస్తాయి. దాగ్, హాలీలు సమకాలికులే. వొకరు జాలిగా కాలంవైపు చూసి స్వీయలోకంలోకి జారుకుంటే ఇంకొకరు జీవితాంతం దానిపై పోరాటం సాగించారు. కృష్ణశాస్త్రి, శ్రీ శ్రీలకున్న భేదమే వారిలోకూడా వుంది. స్వీయవేదనను దాగ్ వెల్లడిస్తే ప్రపంచ బాధ నంతటినీ తనలో సంతరించు కున్నాడు హాలీ. రోమా రోలా వో చోట- "స్వీయ అనుభూతుల్ని ఆవిష్కరించే వారు కూడా గొప్పకళాకారులే, కాని అంత కన్నా గొప్ప వారి హృదయాలు ప్రజలందరికోసం స్పందిస్తాయి" అంటాడు. హాలీ ఈ రెండో తెగకు చెందినవాడు.

గజలుకున్న సీమిత క్షేత్రంతో ఈయన తృప్తిపడలేదు. కొత్తదైన నజం ప్రక్రియకు సరియైన రూపాన్ని యిచ్చాడు. ఆ రోజుల్లోనే సర్ సయ్యద్ సలహాపై తన సుప్రసిద్ధ దీర్ఘకవిత 'ముసద్దసె హాలీ'ని రచించాడు. తర్వాత 'మునాజాతెబేవా' అనేదీర్ఘ కవితను రాశాడు. అతని గజలులు, లఘుకృతులు 'దీవానె హాలీ' అనే పేర ప్రకాశితాలయ్యాయి. ఇతర పద్య రచయితలు 'మజ్మూయె నజ్మె హాలీ' అనే పేర ప్రచురిత మయ్యాయి. దీర్ఘ కవితల్లో ముసద్దస్, మునాజాతెబేవా, బర్ఖారుత్, హుబ్బేవతన్ మొదలైనవి సర్వోత్తమమైనవిగా పరిగణింప బడ్డాయి.

తొలత హాలీ చాలా వ్యతిరేకతకు లోనయ్యాడు. ఇంతవ్యతిరేకత ఈయన కెందు కెదురయ్యిందా అని ఆలోచిస్తే, మనకిప్పుడు ఆశ్చర్యమే కలుగుతుంది. ఆ రంగురంగుల కలల్లో యదార్థం వైపు చూట్టం సహజంగానే నచ్చి వుండక పోవచ్చు. ఇది సంఘ సంప్రదాయం కూడా. కొత్త సంతోషాల్ని తొందరగా స్వీక రించదు. కాని పాత జాడ్యాల్ని మాత్రం సంతోషంగా భరిస్తుంది. స్పందించే హృదయంతో బాటు ఆలోచించగల మనసున్న వాడు హాలీ. ప్రణయంలో ఎంతో కవిత్వమున్నా జీవితంతో పోలిస్తే అది చాలా పరిమితం అని చెప్పకోక తప్పదు. ఈ ప్రణయ స్వప్నాల్లో మునిగివున్న మనకు హాలీ వైపు తొందరగా చూడ బుద్ధి కాదు. కాని మనలో ఏ కొంచెం సాంఘిక స్పృహ వొచ్చినా హాలీని విడిచి పోలేం.

'స్వాంతస్సుఖాయ కావ్యం' అనే కోవకు చెందినవాడు కాడు మన హాలీ. కవిత్వంలో సాంఘిక ప్రయోజనాన్ని కోరినవాడు. అందుకనే ఈయన కవిత్వంలో అందాల మెరుపులూ, ప్రణయ తాపాలూ అంతగా కనిపించవు. ఆ కాలంలో రాయ బడుతూన్న ప్రణయకవిత్వం లోంచి సాధారణంగా అందరూ వాడుతూన్న పదాల పట్టికను, అలాగే భావాల పట్టికను తయారుచేసి వాటిని మినహాయించి రాయగలిగిన వాడినే తాను నిజమైన కవిగా అంగీకరిస్తానన్నాడు.

ఇలా అన్నంత మాత్రాన కావ్యాత్మకు దూరమైన శుష్క నీతుల్ని వల్లించు కుంటూ కూర్చోలేదు. ఒక మహాకవి ప్రతిభకు తార్కాణంగా నిల్చే స్వచ్ఛమైన కవిత్వమున్న ఖండికలు ఈయన కావ్యాల్లో ఎక్కడబడితే అక్కడ కనిపిస్తాయి.

ప్రముఖ జాతీయవాది అయివుండి కూడా తమలోని ప్రతి చెడునూ, మంచిగా భావించే చౌకబారు జాతీయతని నిరసించాడు.

అందుకనే ఆయన కవిత్వమే ఒక విప్లవం. నిశ్శబ్ద విప్లవం. పరిపూర్ణ విప్లవం. ఆయన తన కవిత్వంలో విప్లవం పేరెక్కడా ఎత్తలేదు. కాని గొప్ప భావ విప్లవం తేగలిగాడు. భాషతో కూడా ఆయన పేచీ పెట్టుకోలేదు. పాత భాషలోనే వాడుక పదాల్ని చేర్చి స్వంతం చేసుకున్నాడు.

మహాకవి గాలిబ్ ఎవరికీ కవిత్వమల్లమని సలహాయిచ్చి ఎరుగడు. కాని హాలీ రచనలు చూసి 'నువు రాయకపోతే నీ ఆత్మకే అపచారం చేసినవాడవవు తావన్నాడు.

'కాదేదీ కవితకనర్హం' అన్నట్లు నైతిక విలువలు కూడా కవిత్వమవు తాయన్న సత్యాన్ని నిజంచేసి చూపించి 'నైతికవిలువలు మతగురువుల చేతగాదు,

కవుల చేత నిర్ణయించబడతా' యన్న షెల్లీ వాక్యానికి జ్వలంత వుదాహరణ.

కావ్యజగత్తులోనే కాక వచన రచన ద్వారా కూడా హాలీ గొప్ప మాసినక విప్లవానికి పునాదిరాయి వేశాడు. ఉర్దూలో స్వచ్ఛమైన వచనం అంతకు ముందెక్కడా కనిపించదు. వచనం పేరుతో కూడా జనం కవిత్వమల్లేవారు. పదాల గారడీతో గందరగోళాన్ని సృష్టించకుండా ఆలోచనని స్వచ్ఛంగా వ్యక్తం చేయడం నేర్పిన వాడు హాలీ. అందులో వున్న మహాత్మ్యాన్ని పూర్తిగా ఎగిరిన వాడు కూడా. ఎందుకంటే భాషాపరమైన లోపాన్ని భావం కప్పెడుతుంది గాని భావ లోపాన్ని మాత్రం అందమైన పదాలు తీర్చలేవు.

షార్టుహ్యాండుగా సైగల్లో మాట్లాడడమే కవిత్వంగా చెలామణీ అయ్యే రోజుల్లో, ఈయన హృదయాల్ని కదలించడంతో పాటు మనసుల కిటికీలు తెరచి వాటిల్లోకి వెల్తురును ప్రసరింప జేసే కార్యక్రమాని చేగొన్నాడు. హాలీ తెరవక పోతే బహుశా చాలా మేధస్సుల కవాటాలు తెరవబడేవి కావేమో. హాలీయే లేకుంటే ఇఖ్బాల్ మహాకవి ఇఖ్బాల్ అయివుండేవాడు కాదేమో.

'యాద్‌గారె గాలిబ్', 'హయాతె సాదీ', 'హయాతె జావీద్' అనే పేర్లతో వరుసగా మహాకవి గాలిబ్, వార్సీ మహాకవి సాదీ, సర్ సయ్యద్ అహ్మద్‌ఖాన్‌ల జీవిత చరితలు రాసి ఉర్దూలో జీవిత చరిత్రల రచనకు ఆద్యుడయ్యాడు.

ఆత్యాధునికుడై వుండి కూడా ప్రతి పాతదాన్ని అసహ్యించుకునే వాడు కాదు. చాలామంది ఆధునికుల్లా వెర్రికేకలు పెట్టే తెగకు చెందనవాడు కూడా కాదు. సాహిత్యకారుని నిజమైన స్థానాన్ని ఎగిరినవాడూ, దాన్ని సక్రమంగా నిర్వహించిన వాడే మహాకవి.

ఉర్దూలో తొలిసారిగా సాహితీ విలువల్ని నిర్ణయించే ప్రయత్నంజేసి తొలి విమర్శకుడయ్యాడు హాలీకి ముందు మహా చెబితే 'ఈ పద్యం బావుంది, ఈ కవిత సుధామధురమైంది, తీయని తేనె లొలికే కవిత్వం' అని మాత్రమే చెబుతూండేవారు. కాని ఆ తీయదనం రావడానికి గల కారణాల వైపు మాత్రం ఎవరి దృష్టి పోలేదు. 'ముఖద్దమ యెషెరొ షాయెరే' అనే గ్రంథంలో ఈ ప్రయత్నం చేశాడు హాలీ.

వాత చందస్సులతో తృప్తిపడి సేమిత క్షేత్రానికి సాహిత్యాన్నంతటిని అంకితం చేసిన వారికి జవాబుగా నిలిచినవాడూ, నిజమైన సాహిత్యకారునీ స్థానాని ఎరిగిన వాడూ. విప్లవం, విప్లవం అటూ కేకలు పెట్టకుండా నిశ్శబ్దంగానే బ్రహ్మాండమైన భావవిప్లవాన్ని సాధించి 'షంసుల్-ఉల్మా' అను బిరుదాన్ని పొందిన అల్తాఫ్ హుసేన్ హాలీ 1914లో శాశ్వతంగా ఈ లోకాన్ని విడిచి వెళ్ళిపోయాడు.

## పోస్ట్‌మేన్

నిట్టల ఫణిమిత్ర

హాస్య, శోక,
శృంగారాది నవరసాల్ని
తనతో మోసుకొస్తూ,
ఎదురు చూస్తున్న
మీ హృదయాలలో
ముగింపున
విషాదాన్నో,
వినోదాన్నో
మీలో క్రుమ్మరించే
పంచరంగుల సినిమా!

# అపద్ధమాడరాదు

## కథానిక

### విద్వాన్ దస్తగిరి

కంబగిరికి ఎంత సంబరంగ ఉందంటె చెప్పలేనంతగ ఉంది. ఎవరో ఇచ్చిన అర్ధఓళిగ తిన్నట్లు కాక, దండిగ తన ఇంట్లోనే చేసుకొని ఎప్పుడు పడితె అపుడు దినమంతా తిన్నంత సంబరంగా ఉంది. సత్య వాక్కుకు గల మహాత్మ్యం గురించి పాఠము చదివినప్పటి నుండి, అయవారు చెప్పి నప్పటి నుండి ఈ విధంగా ఉంది. అపద్ధమాడకుండ నిజమే చెప్పినచో దేవుడే ప్రత్యక్షమై కోరిన కోర్కెలు అనగా రంగు రంగుల టెరీకాటన్ శ్లాగులు, బెల్టు నిక్కర్లు, లడ్డులు, ఓళిగలు, మేడ, కారు, అమ్మకు టెర్లీన్ చీర, నాయనకు గ్లాస్కో పంచ . . . . ఇంకా – ఇంకా – ఎన్నో, ఎన్నెన్నో, దేవతలు దిగివచ్చి, పుష్పక విమానంలో తీసుకొనిపోయి స్వర్గంలో పూల సింహాసనం మీద కూర్చో బెడతారట, అమృతం ఇస్తారట, అది తాగితే చావే లేదట. కల్పవృక్షం దగ్గరకు పోయి ఏది కోరితే అది ఇస్తుందట. ఇన్ని సౌఖ్యాలు తలచుకుంటూనే ఉక్కిరి బిక్కిరిగా ఉందే ఇంక అనుభవంలోకి వస్తే – ఇవన్నీ అయవారు చెప్పినవే! ఆ పాఠాన్ని తాను ఎన్నిసార్లు చదివాడో! హాయి హాయి అనుకుంటున్నాడు.

"హాయి! హాయి!" అనుకుంట న్నవాడు అకస్మాత్తుగా 'అబ్బ' అని ఉలిక్కిపడి తెప్పరిల్లినాడు. కారణం వాల్లమ్మ వీపు మీద 'ఓ దడెం గుద్దు' వేయటమే.

"పాపం పిల్లోడు కాల్లు కాలే ఎండ పొద్దు కాడే కలవరాల్లో తేలి పోతున్నాడే" అంది వాల్లమ్మ.

ఆమె కంబగిరిని ఊరి బయట చింత మాను కిందికి తీసుకు పోయింది. చింత మాను దగ్గరగా ఒక మిద్దె ఉంది. మిద్దె వెనుక మట్టి దిబ్బ, పాడుపడిన గోడలు ఉన్నాయి. వెనుక నుండి మిద్దెను సులభంగా ఎక్కవచ్చు. ఆమె కంబగిరి చేతికి 'బ్యాగు తిత్తి' ఇచ్చి "లే! మెల్లిగ మిద్దెక్కి, పాక్కుంట, పాక్కుంట పోయి, సంచి నిండా రాగులు పోసి, మల్లా పాక్కుంట, పాక్కుంట వచ్చి నా కందీయ్ బద్రం. తలకాయి పైకెత్తినావా – ఒక రాగ్గింజ పోయిందా ఎముకలు సున్నం చేస్తా". కొడుక్కి మొదటి సారిగ పని అప్పగిస్తూ అందామె.

"మనవే నామా రాగులు ?" అడిగినాడు కుమార రత్నం.

"ఆ మనవే. మీ యప్ప, మీ తాత లచ్చలకు లచ్చలు పోసి చెరువు కింద కొనిండ్రా నూరెకరాలు; ఆ నూరెకరాలు పట్టాలోనివి. యాడుండాయిరా కొడుకా మనవి"– పైకెక్కమని సైగ చేసింది.

"పరుల వస్తువులు ముట్టడం పాపం." పుస్తకంలో చదివిన మాటల్ని, అయవారు కంఠస్థం చేయించిన మాటల్ని వప్పగించాడు విద్యార్థి కంబగిరి.

కంబగిరి చెంప చెళ్ళుమంది. ఓ నిమిషం ఎదుట ఉన్న తెల్లని గోడ గోడగా కాక కదులుతున్న ఆవిరి పొగలా కనపడింది.

"చెప్పిన పని చెయ్యమంటే యాలాదే దెవరంటావే. జిత్తెడు లేవు. కన్న తల్లికే అడ్డ నీతులు చెప్తావ్. చెప్పిన పని చేయ్." ఆమె మాటలు

ఊరిమినాయి.

ఇక తప్పదని అమ్మ చెప్పినట్లు పాకి, రాగులు తెచ్చినాడు. ఆమె ఎట్లట్లో తిరిగి వచ్చి మూరకో రంగుగుడ్డ అతుకేసిన చీర అడ్డు చేసుకొని రాగులు ఇంట్లో చేర్చింది. అయినా కొందరు గుర్తించనే గుర్తించారు. ఇంటికి వచ్చిన తరువాత నీతులు చెప్పినందుకు తిట్లు తిన్నాడు కంబగిరి.

సాయంత్రం ఒకాయన కూలికి పిలువ డాన కొచ్చినాడు.

"ఏమండీ రొడ్డి సానిగారూ! రేపన్నా మా మీద దయ జూపుతారా?" అన్నా డాయన. 'రొడ్డి సాని' అనిపిలిచినందుకు ఆమె కిసకిస నగి "ఈ పొద్దంటే ఆ మామ ఊరికే అట్ల బంగక పోతా ఉంటే పోతి" అంది పొయ్యిలేకి పుల్లలెగేస్తు.

"ఊహూం. మామంటే రుసి. అన్న ఏం రుసి? మరి ఇంకెట్లుబంగక పోయేది? కాళ్ళు పట్టు కుందునా ?" అన్నాడు పొయ్యిలో బీడీ ముట్టించు కుంటూ.

"రేపు కచ్చితంగా వస్తా పోన్నా" కుండలో ఎసురు పోస్తూ అంది.

'ఎందుకొస్తావులే. మీ మామ దగ్గరకే పో. ముందుగా కూలిచ్చి పొరపాటు చేసినాను. కూత కూసినంక తప్పరాదు. అది నాలికా! బట్టపేలికా ? వారం నుంచి ఒకటే అసత్యం మాటలు – ఈ పొద్దొస్తా రేపొస్తా – అని. సిల్లర సిల్లర యవారం ఇడిసి పెట్టేల్లేదే. రేపుగిన రాకపోతివో సావిట్లో కట్టేసి నా కూలి ఇచ్చే దంక కదలనీను" అన్నాడాయన ఆరిపోతున్న బీడీని గబగబ పీలుస్తూ.

ఇంతలోకే సత్యమే పలకమని బోధించే పాఠము చదివి మురిసిపోతున్న కంబగిరి - వాల్లమ్మ మరచి పోయిందనో, అపద్ధ మాడినందు వల్ల వచ్చే నరకం నుండి కాపాడాలనో – ఓ విషయం గుర్తు తెచ్చినాడు. "రేపు వస్తానని వాల్లిట్లో కూలితెస్తివేమూ మల్లా రేపు వస్తానని ఈ మామకు చెప్తుండావు" అన్నాడు కంబగిరి.

"ఎపుడు తెస్తిరా కొడకా నేను" కరచినట్లు అందామె.

"సిల్లరదానా! వాన్నే దబాయిస్తు న్నావే. ఇగో ఎందుకు నీతో తగాదా. కూలి ముందుగ ఇవ్వడం నాదే బుద్ధి తక్కువ. నీవు రావడమూ వద్దు, చేయ డమూవద్దు. నా దుడ్లు నాకీ" అన్నా డాయన కోప కోపంగా.

"యాడా లేదు పోన్నా టక్కుటు మారోని మాటలకేం గాని." నవ్వుతూ అందామె.

"అపద్ద మాడినందుకు నువ్వు నిజ మైన దానివి. సత్యం పలికినందుకు వాడు టక్కుటమారోడు. వాదనెందుకు గాన మర్యాదగా నా దుడ్లు నాకీ. నేను మంచికి మంచి. చెడ్డకు పరమ చెడ్డ. నాకు గిని కోపం రేగిందా సూసుకో ఏం చేస్తానో. వారం పొద్దు నుంచి దినామూ టక్కు లేనా. ఛు. ఊ ఇచ్చెయ్. లేకపోతే మాయమ్మ సాచ్చిగ గుండు గొరిగించి చెప్పుల సరము ఏసి గాడిద మీద ఊరే గిస్తా." టువలు గట్టిగా విదల్చించి భుజం మీద వేసుకున్నాడు.

"రేపు రాకపోతే అట్టే సేత్తువుపోన్నా. అన్నే సంబరపడి ఊరేగిస్తా నంటే సెత్తెలు వద్దంటుందా! బంగారు మాల. మా బీదరికం సెడ్డ. భగవంతుడు ఆ రాత రాసి నాడు. ఎవరేమన్నా అని పించుకో వలసిందే" అంటూ రాని కన్నీరు చెరుగుతో తుడుచుకుంది. ఆ

కన్నీటికి ఆయన గుండె కొంచం కరిగి నట్లయింది. "రేపు రాకుంటే సూసుకో" అంటూ వెళ్ళిపోయాడు.

ఆ మరు క్షణంలోనే "ఒసే తుడుగు దానా! ఎందరుమిసినా నన్ను కాదం టావు గదెనే" అంటూ కడింటి ఆది శేషమ్మ వచ్చింది.

"ఏం జేసినానని అట్ల మాట్లాడు తున్నావ్" అంది కట్టె విరిచి పొయ్యిలో పెడుతు.

"సెప్తో కొడుదునా? ముప్పయి రెండు పండ్లు తెరచి యింకా మాట్లాడేవి జేసు. మానంగా దొంగలు కొచ్చిన రాగులు ఇచ్చె" పడేసి తొక్కినట్లు మాట్లాడింది శేషమ్మ.

"ఓహో యవారం బాగుందే! యా సవితి కూసింది. యా నా కొడుకు కూసి నాడు. ఊరందరికి నేనేనా అదవ సిక్కిందాన్ని. పోనీ నేను తెచ్చింది నిజ మైతే, వాళ్లు చూసిందీ నిజమైతే అప్పుడే పట్టుకోకూడదా. గాడుదులు కాస్తాం డిరా. రామా! కృష్ణా! అని ఇవుడొస్తు న్నాను. వాళ్లింట్లో గింజలు తెచ్చు కున్నాను. కావాలంటే పద పలికిస్తా." గాలిలో ఊరందరి మొగాలు పొడుస్తా అందామె.

"నోర్మూయ్ దొంగదానా! బో సంప న్నురాలాకట్ల మాట్లాడుతున్నావ్. ఎన్ని దొంగతనాలు పట్టు బడలేదు. ఎన్ని తిట్లు తిసలేదు. తన్నులు తినలేదు. ఒరే కంబిగా! ఇట్ట రా రా! చదువు కొనే వాడివి. అపద్దం చెప్తే పాము వచ్చి కరు స్తుంది. నిజం చెప్పు శేరు బెల్లం యిప్పిస్తా. నువ్వు మీయమ్మ రాగులు తెచ్చినారా, లేదా?" అంది కడింటి ఆదిశేషమ్మ.

కష్టాల మీద కష్టాలొచ్చినా, పర పర కోసినా సరే హరిశ్చంద్రుని మాదిరి సత్యమే చెప్పినచో దేవాన దేవతలొచ్చి పూలవర్షం కురిపిస్తారు. కోరిన కోర్కెలు ఇస్తారు" అన్న అయ్యావారి మాటలు మరింత గట్టిగా వినబడుతున్నాయి. "అపద్ద మాడ రాదు" అన్న పాఠం మరింత స్పష్టంగా కనపడుతోంది కంబగిరికి.

జరిగింది చెప్పినాడు పిల్ల సత్య హరిశ్చంద్రుడు.

"చూడే జగత్ కిలాడి చూడు. దొంగతనం చేసే బదులు కష్టపడు. నాలుగు కాదని పదిండ్లు అడుక్కు తిను" అంటూ వెంట్రుకలుపట్టి ఈడ్చి కొట్టింది. ఇంట్లోకి దూరి కుండలో ఉన్న రాగులు— రేపు కూలికి వస్తానని తెచ్చుకొన్న రాగులు, ఇంకొంచం సేపటిలో సలసల కాగే ఎసుట్లో పడి సంగటి కాబోతున్న రాగిపిండితో సహా - తీసుక పోయింది.

ఇక మన పిల్ల హరిశ్చంద్రుని కష్టాలు చెప్పనలివి కానివి. పూల వర్షం కథ దేవుడెరుగు. తిట్లు దెబ్బల జమిటి వర్షం పిల్లవాడెరుగు. జుట్టు పట్టి జర జర ఈడ్చింది. మోచేతి మోచేతితోనే కొట్టింది. కాళ్ళ కాళ్ళతోనే తొక్కింది. "సత్య అరిచ్చంద్రుడు పోతా పాతా యియ్యప్పని ఉండమన్నాడు కాల్లా" అంది.

"అపద్దాలాడ రాదని బుక్కులో రాసి నారు. అయవారూ చెప్పినాడు" ఎక్కిళ్ళు పడుతు అన్నాడు కంబగిరి.

"యా బుక్కురా బుక్కు" అంటూ బుక్కు పరపరా కులు చేసింది. పొయ్యిలో వేసింది. "అయవారు కేంరా ఏమైనా చెప్తాడు. పట్టి జీతాలొస్తాయి. కుర్జీ మీద కాలు మీద కాలేసుకొని, సిగరెట్టు తాగుతా ఏమైనా చెప్తాడు. ఓన మాల చదువుకే ఇంత కొంప కష్టాలు

స్తుండావే. ఇంకా సదివితే-లేయ్! రేపట్నుంచి బడికి పోయినావా చూడు. ఖాంచత్! ఎముకలు సున్నం చేసి వక్కాకేసుకుంటా. గంపెత్తుకొని ప్యాడ పట్టేకి పో. నిజం పలుకుతాడంట నిజం. నిజం చెప్పిన దానికే రాత్రికి గంజి కూడా కరువాయి పోయేనే"— అంటూ దెబ్బలు తిని,తిని; ఏడ్చి, ఏడ్చి యిక ఏడ్వలేక కూలిపోయిన కొడుకును ప్రేమ, శోకం నిండిన వేళ్ళతో పుడుకుతూ- కన్నీటితో తడుపుతూ అమె...

(ఆకాశవాణి కడప కేంద్రం సౌజన్యంతో)

# వెన్నెల పాదముద్రలు . . . . విరియాల లక్ష్మీపతి

వైశాఖ పూర్ణిమ నాటి వెన్నెల
శిల్పీకృత రాజహంస;
చల్లగా గుండెలపై వాలింది,
జ్ఞాపకాల వింజామరలు వీచింది.
అప్పుడెప్పుడో ఈ నేలపై
రాజ్యం చేసిన
బాధల తుఫానుల్ని
— ఒక కిరణంతో ముడివేసి
నభోంతరాళానికి లాక్కుపోయింది
చంద్రిక !
వ్యధల కాయాన్ని
శరీరార్థ భాగాన్ని
శయ్యాగారంలో విడిచిన రాత్రి
ఓర వాకిలి నుంచి నిర్దయగా
ఆశా శబ్దం నిష్క్రమించిన రాత్రి
కురిసిన ఆ అశువుల బండరాళ్ళపై
సత్యాన్వేషి పాదముద్రలు . . .
సిలుగుల జడివానలకు కరిగి
ఋతువుల రెక్కల మీంచి దొర్లి
ఈ వసుమతి నంతా నాగుల్లేని
పూల తోటగా మార్చాలన్న జిగీష!
కనురెప్పలపై మూగ వేదనలు
భాషల కందని తత్త్వ గీతాల
నాదామృతంగా
ప్రవహింప చేయాలన్న పిపాస!
ఆదినుండీ అశ్రుకణాల్నే
మోసిన ఈ వెర్రి నేల
చెక్కిలి ఎర్రబడి కందిపోయింది!
మార్క్స్ పాదపాలు
చిరుగజ్జల రవళి వినిపించిన చోట
సామాజిక ఊషరక్షేత్రంపై
జ్ఞాన పత్రాలు రాలుస్తుంది.
అక్కడ చెముడు కాకులు సైతం
కల కూజితాల్నే గానం చేస్తాయి!
కురిసిన వెన్నెలనంతా
సంగీతమయంగా
శిల్పీకరిస్తాయి!!
ఎక్కడ పర్వతాగ్రాలపై
మౌన తపస్సు చేసుకొని
ఆర్ష చక్షువు తెరుస్తుందో ...
ఆ కడ చూపుల వెలుగు రేకలముందు
సర్వరాజసమూ మోకరిల్లుతుంది ...
ఎదల నివాళు లర్పిస్తుంది!
ఆనాటి సూర్యుడు రాజయోగి.
కాషాయి శాటిలు ధరించినా
పుడమి సతిని వదలి
దూరదూరంగా జరగని విరాగి!
అప్పుడు జాతి
రుజాగ్రవ్యవస్థలోంచి మేల్కొని
విశిష్ఠ వాస్తవంలోకి నడుస్తుంది.
మౌన ముద్రలు చిందిన
అమల హసనా లానాడు
సర్వసమీరాల్ని ఆరోగ్యవంతం
చేస్తాయి!!

# ఆజర్‌బైజాన్ వచన కవితలు

## గ్యుల్హుసైన్ గుసైనొగ్లు

### రెండు తలుపులు

రెండు తలుపులు. ఒకదాని కొకటి ఎదురుగా రెండు తలుపులు. వాటికి మధ్యను నడవ.

రెండు తలుపులు. ఒకటే రంగుని, ఒకే ఆకారానివి. ఒకే ప్రమాణానివి. రెండు సరిగ్గ ఒకలాగే ఉంటాయి. రెండు తలుపులు.

అవి తెరచుకుంటాయి, మూసుకుంటాయి తరచు. మూసుకుంటాయి, తెరచుకుంటాయి. రెండు తలుపులూ తరచు.

వాటిలో ఒకటి చాలా నెమ్మదిగా, చప్పుడు లేకుండా తెరచుకుంటుంది. తరవాత అదేవిధంగా మూసుకుంటుంది. నెమ్మదిగా, చప్పుడు లేకుండా ఆ తలుపుల్లో ఒకటి.

రెండోది కోపంతో దభాలున తెరచుకుంటుంది, కోపంతో దభాలున మూసుకుంటుంది. కోపంతో - ఆ తలుపుల్లో ఒకటి.

ఒకటి తళతళ మంటుంది, దానిని తెరచేవాళ్ల, మూసేవాళ్ల మొహం లాగా, వాళ్ల ఆనందంలాగా, వాళ్ల, కోరికల్లాగా, కలల్లా. వాళ్లతో కలిసి చిరు నవ్వుతుందది.

రెండోది, దానిని తెరిచే వాళ్ల, మూసే వాళ్ల మొహాలంతగా నల్లనిది. యాతన పెట్టే వాళ్ల విచారం అంతగానూ, కొనసాగే దుఃఖం అంతగానూ అది నల్లనిది. వాళ్ళతో కలిసి ఏడుస్తుందది. తమ జీవితాన్ని నిర్మించుకుంటోన్న వారు, తమకు అభిమాన పాత్రమైన యింటిని నిర్మించుకుంటుంటోన్న వారు తెరిచేది, మూసేది, ఒకటి.

విడిపోతూన్నవారూ, విడాకులిచ్చుకుంటున్న వారూ, శాశ్వతంగా ముక్క చెక్కలతున్న వారూ తెరచేది, మూసేది రెండోది.

ఒకే రంగువి, ఒకే ఆకారానివి, ఒకే ప్రమాణానివి రెండు తలుపులు. రెండూ సరిగ్గా ఒకదాని లాగా యింకోటుంటాయి. రెండు తలుపులు. చాలాకాలం కిందట అవి ఏకమైవుండవలసింది. ఈ తలుపుల్లో ఒకటి తన జీవితానందాన్ని, సుఖాన్ని, సంతోషపూర్వకంగా పంచుకుంటుంది. రెండోది పెనుబాధలూ, దుఃఖమూ భరిస్తోంది. అవే గనక కలిసినట్టయితేనా . . .

దొంగ ప్రేమికులు వాటిలో ప్రవేశించకండా వుంటేనే.

### రైలు బయలుదేరింది

రైలు వెళ్లిపోయింది . . .

ప్రతి రోజూ ఎన్నో రైళ్లు . . . అవి గ్రామం మీదుగా పోతుంటాయి . . .

బాల్యంలో తాను, తన స్నేహితులు రోడ్డువేపు పరిగెత్తి, రైలు వెళ్ళేటప్పుడు చిన్న గుట్ట ఎక్కి, దిగువ దూసుక పోతోన్న రైలు పెట్టెల్ని, కిటికీలనీ, మనుషుల్ని, తమకు తెలియని 'అత్తయ్య'ల్ని, 'మామయ్య'ల్ని చూడడమూ; వాళ్లవేపు తాము చేతులూపడమూ ఆమెకు స్పష్టంగా జ్ఞాపకముంది.

రైలు కనిపించకుండా పోయినంతదాకా, అడవి నల్లదనంలోకి అది అదృశ్యమైనంతదాకా తాను చేయి ఊపేది.

ఆలోచన లేకుండా, బాధ పడకుండా చేయి ఊపడమంటే ఏమిటో బోధ పర్చుకోకుండా తాను చేయి ఊపేది.

రోజుకు అనేక రైలు బళ్లతో ఆడుకొనే ఆటది, తనకు కేవలం మామూలు బాల్యక్రీడది.

తన బాల్య ప్రపంచానికి ఆట ప్రత్యేకమైన ఆనందాన్ని తీసుక వచ్చేది. బాధ్యతల బాధను తాను తెలుసుకొనేదాక, దుఃఖాన్ని, ఆలోచననీ తెలుసు కొనేదాకా, తన కళ్లు ఒకే విషయాన్ని, ఎడబాటు బాధను తెలుసుకొనేదాక అది ఆనందాన్ని తెచ్చింది. అంతవరకూ సజీవమైన క్రీడ అది! . . . ఆమె బిడ్డగా వున్నప్పుడు!.

తాను పెద్దయ్యాక యీ 'ఆట'ను ఆడడం ఎప్పుడు, ఎలా మానేసిందీ ఆమె గమనించలేదు. అప్పుడది, ఆమెకు హాస్యాస్పదంగా కనిపించింది. అప్పుడది చీకూ చింతలేని బాల్య దశ జ్ఞాపకమయిపోయింది. తరవాత . . .

తరవాత, రైలు వేపుగా చెయ్యి ఊపడమంటే నిజంగా ఏమిటో తాను సంపూర్ణంగా అర్థం చేసుకున్న కాలం వొచ్చింది. బాధతో ఆమె అర్థం చేసుకుంది. . . .

రైలు వెళ్లిపోతోంది, ఆమె చెయ్యి ఊపుతోంది. వెళ్లిపోతున్నది ఆమె గుండె, రైలు కాదు. ఆమె గుండె వెళ్లిపోయింది.

రైలు వెళ్లిపోయింది. అది ఎప్పటికీ కనిపించకుండా పోకూడదనీ, అడవి లోకి అదృశ్యం కాకూడదనీ ఆమె కోరుకునేది. అది వుండిపోవాలని వెయ్యిసార్లు, లక్షసార్లు ఆమె కోరుకునేది! కాని పట్టించుకోకుండా రైలు వెళ్లిపోయింది, తన కోరికల్ని, తన బాధలనూ పట్టించుకోకుండా.

ఇంకో క్షణం, అది కానరాకుండా వెళ్లిపోంది, చెట్లు మింగేస్తాయి దానిని. ఆమె చెయ్యి ఊపుతోంది, ఊపుతోనే వుంది. అది తన చేయి కదలిక మాత్రమే కాదు; ఆమె శరీరం, యావత్తు జీవితమే దీన్లో వుంది. ఆమె గుండె కంపిస్తోంది. ఆమె కళ్లు నీళ్లతో నిండిపోయాయి. కన్నీరు నిండిన ఆమె కళ్లు, చిట్టచివరి చూపు కోసం, రైలును ఆపేందుకోసం పెనగులాడుతున్నాయి. కళ్ల నిండా ఆందోళన, భయం నిండాయి; నింపి ఆమె చెక్కిళ్ల మీద కన్నీళ్లు జార్చాయి.

రైలు దూరానికి వెళ్లిపోతోంది: ఆమె చెయ్యి ఊపుతోంది . . . ఊపుతూనే వుంది. రైలు మాయమైపోయింది.

# అఖిల భారత తె

# సమ్మే

## వివిధ సాహిత్య ఆలోచ

(ఇద్దరు

డబ్బయ్యేళ్ల క్రితం గురజాడ పాల్గొని తన కవితలో ప్రస్తావించి నసహపంక్తి భోజనం, తెలుగు గ్రంథాలయాల్లో ఆది కాలపు వాటిలో ఒకటయిన ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజం, వేగుజుక్క గ్రంథమాల స్థాపన; తదుపరి నవ్య సాహిత్య పరిషత్తుగా పేరుపొందిన 1933 నాటి అఖిలాంధ్ర కవి పండిత సభలు జరిగిన బరంపురంలో జనవరి 21, 22, 23 తేదీలలో అఖిల భారత తెలుగు రచయితల సమ్మేళనం వివిధ సాహిత్య ఆలోచనా విధానాలకు చెందిన, దేశం నలుమూలల నుండి వచ్చిన రచయితల వేదికగా విశిష్టతను పొందింది. వివిధ సాహిత్య రంగాలకు చెందిన రెండు వందల మంది సాహితీ వేత్తలు, రచయితలు సభలు జరిగిన మూడు రోజులు చేసిన ప్రసంగాలు, చర్చలు, వాదోపవాదాలు నేటి తెలుగు సాహిత్య స్థితిగతులను తేటతెల్లం చేశాయి.

యువతీ యువకులు మహాకవి గురజాడ 'దేశభక్తి' గేయాన్ని గానం చేయటంతో సమ్మేళనం కార్యక్రమాలు ప్రారంభించ బడ్డాయి. ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజం ఉపాధ్యక్షులు డా॥ కోకా సత్యనారాయణరావు స్వాగత వచనాలు పలికారు. సమ్మేళనం కార్యదర్శి శ్రీ స్వామి ముఖ్య అతిథిని, వక్తలను, పార్లమెంటు సభ్యులు శ్రీ రాచకొండ జగన్నాధరావు, శాసనసభ్యులు శ్రీ బిస్వనాధ సాహూ గార్లను వేదికపైకాహ్వానించారు.

# ప్రసంగాలనుండి

మున్ముందు చూపున్న అవాస్తవిక ధోరణుల్ని నేను అంగీకరిస్తాను. . . .వామపక్ష రాజకీయ పార్టీల, సాహిత్య సంస్థల ఐక్యతతో నిమిత్తంలేకుండానే యీ దేశంలోని కార్మిక కర్షకులు ఎర్ర సైన్యంగా ఏర్పడుతారు (శ్రీ శ్రీ)

స్వేచ్ఛా ప్రణయం, సూడోసైకొలాజికల్ గిమ్మిక్స్, హత్యలు సాహిత్యంలో ఫాషన్ అవుతుండడం విచారించవలసిన విషయం. ప్రాథమిక పరిజ్ఞానం లేకండా రాయడం, రాతలకీ చేతలకీ పొంతన లేకపోవడం, పలాయనవాదం-యివి ప్రధానంగా అవాస్తవిక ధోరణులు. సాహిత్యం చీకట్లు తొలగించే టార్చిలైట్ అవుతూనే,మనిషి నిజంగా చేరాల్సిన దిశకు లైట్‌హౌస్ అవ్వాలి. (వాకాటి పాండురంగారావు)

నిన్నటి వర్గశత్రు నిర్మూలనా విధానాన్ని నేడు తిరస్కరించవలసి వచ్చింది కాబట్టి, రాజకీయ ఎత్తుగడల మలుపులకి సంబంధించినంత వరకు రచయిత వాటికి దూరంగా వుండాలి. (జ్వాలాముఖి)

మానవుడు రాయడం నేర్చుకున్నాక, అతనికి గత చరిత్రంతా మహాద్భుతంగా కనిపించి,

# లుగు రచయితల
# ర్శనం
# నా విధానాల ప్రతిబింబం

లేకరులు)

అంతర్జాతీయ ఖ్యాతి వహించిన కవి, సాహిత్యవేత్త, ఒరిస్సా రాష్ట్ర సాహిత్య అకాడమీ అధ్యక్షులు అయిన శ్రీ సచ్చిదానంద రౌతు రాయ్ సమ్మేళనానికి ప్రారంభోత్సవం చేస్తూ, ఆంధ్ర సాహిత్యం ఒరియా సాహిత్యం కంటె 300 సంవత్సరాలు ముందు నుండీ వుందన్నారు; వివిధ భాషల్లోని ఉత్తమ సాహిత్యం అన్ని భాషల్లోకి అనువాదం కావాలని నొక్కి చెప్పారు.

మధ్యాహ్నం శ్రీ తుమ్మల వెంకట రామయ్య అధ్యక్షతను జరిగిన సాహితీ సదస్సులో, ఇస్మాయిల్, శీలా వీర్రాజు, వాకాటి, పాండు రంగారావు, చాగంటి సోమయాజులు, కావిలపాటి విజయలక్ష్మి, జ్వాలాముఖి, చరబండ రాజు, బుద్ధరాజు, కొమ్మెర్ల, సాంధ్యశ్రీ, సత్యసావిత్రి, రామతీర్థ చంద్రమౌళి మొదలైనవారు స్వీయ రచనలు చదివారు. ఆ తర్వాత అత్యంత ఉత్సాహ పూరిత వాతావరణంలో శ్రీ పుప్పల లక్ష్మణరావు, మహాకవి శ్రీశ్రీ, మహా పండితులు శ్రీ విశ్వనాధ వరహా నరసింహ శాస్త్రిగార్లకు శ్రీ సచ్చిదానంద రౌతు రాయ్ బరంపురం పట్టుతాపితాలతో సన్మానం చేశారు. కుమారి దేవి 'ఒడిసి' నృత్య కార్యక్రమంతో తొలి రోజు కార్యక్రమం ముగిసింది.

రెండో రోజు ఉదయం శ్రీ కాశీపట్నం రామారావు అధ్యక్షతను 'నేటి సాహిత్యంలో అవాస్తవిక ధోరణులు' అనే అంశంపై గోష్ఠి జరిగింది. శ్రీమతి పి. చిరంజీవినీ కుమారి, సామాజిక

## ప్రసంగాలనుండి

దాని గుణ పాఠాలను భావి కాలానికి అందించాలనే భావన కలిగి, ఆ కాలంలో భారతదేశంలోనే కాక గ్రీసు, చైనా మొదలైన అన్ని దేశాలలోనూ యితిహాసాలు పుట్టాయి. ఆ చారిత్రక సంధికాలంలో పుట్టినందు వల్లనే వాటికి ప్రాధాన్యం వచ్చింది. అయితే వాటిలోని కథలను తలక్రిందులు చేసి విప్లవకరంగా విశ్లేషించామనుకోవడం సవ్యమైన పని కాదు వాటిలో వ్యక్తమైన ఘర్షణలను, వ్యక్తికి-సమాజానికి, దళిత వర్గాలకి-పెత్తందార్లకి జరిగిన ఘర్షణలను స్వీకరించి నేటి అవసరాలకి మలుచుకొని రచన చెయ్యవచ్చును. (ఏటుకూరి బలరామమూర్తి)

విప్లవమంటే ప్రజల్ని నరికి పోగులు పెట్టడం, రక్తపు ఏరులు పారడం అనే దురభిప్రాయం కలగవానికి కారణం ఏమిటో తక్షణ విప్లవం కోరుకునేవారు మనస్సుల్లో తడిమి చూసుకుంటే తెలుస్తుంది. (కాళీపట్నం రామారావు)

సిద్ధాంత స్పృహ సాహితీ ప్రకియల్లో అంతర్లీనంగా వుండాలి. (అక్కిరాజు రమాపతిరావు)

ప్రగతి శీలత్వం పేరుతో ప్రయోగవాదాన్ని ఆరికట్టరాదు. (వేగుంట మోహనప్రసాద్)

పరిస్థితులను స్పష్టంగా అవగాహన చేసుకొనక పోవడంవల్ల నేటి సాహిత్యంలో అవాస్తవికతకు దారితీస్తున్న ధోరణులు కనిపిస్తున్నాయన్నారు. శ్రీ జ్వాలాముఖి మన స్వేచ్ఛ గానుగెద్దుకు గంతలు కట్టి తిరగమన్న చందంగా వుందని, నేడు తిరిగీ రసవాద సిద్ధాంతానికి వూపిరిపోసే ధోరణులు తలెత్తుతున్నాయన్నారు. శ్రీ వాకాటి పాండురంగారావు 'తమ కర్తవ్యం విస్మరించిన కవులు భావి తరాలకు బాట చూపలే'రన్నారు. శ్రీ రామమోహనరాయ్ జీవిత వాస్తవాలను, కర్తవ్యాలను గుర్తింపచేసే సాహిత్యానికి ప్రభుత్వాల కబంధ హస్తాల బాధ తప్పడం లేదని, యీదురవస్థ వున్నంతకాలం యదార్థాలు బైటపడవు, వాస్తవికతకు స్థానం వుండదన్నారు. శ్రీకాళీ పట్నం రామారావు గోష్టిని ముగిస్తూ రచయిత తన రచనా శక్తిని అభివృద్ధి పర్చుకొని, సామాజిక స్పృహతో రచనసాగించాలని, అందుకు అనేకమంది ఉత్తమ రచయితల రచనల నుండి వుదాహరణలను యిచ్చారు.

సాయంకాలం జరిగిన 'భారత, రామాయణాలు, ప్రస్తుతాన్వయం' అనే అంశంపై జరిగిన గోష్టికి శ్రీ వుప్పల లక్ష్మణరావుగారధ్యక్షత వహించారు. శ్రీ ఏటుకూరి బలరామమూర్తి, శ్రీమతి పి. చిరంజీవినీ కుమారి, శ్రీ వంగపండు లక్ష్మినాయుడు, శ్రీ వి. వి. యస్. శాస్త్రి పాల్గొన్నారు. వక్తలు మన ప్రాచీన సాహిత్యాన్ని సమకాలీన సమస్యలకే విధంగా అన్వయించుకోవాలో సోదాహరణంగా వివరించారు. శ్రీ లక్ష్మణరావు పరిణామాత్మకమైన సమాజ పరిస్థితులీ సాహిత్యంద్వారా గ్రహించాలన్నారు.

యువ కళాకారుడు శ్రీ జమ్ముల కేదారినాథ్ ప్రకాశం పంతులు – మహాకవి గురజాడ నిలువెత్తు చిత్రాలు చక్కగా చిత్రించినందుకు సుప్రసిద్ధ చిత్ర కళాకారులు శ్రీ శీలా వీర్రాజు సన్మానించారు.

శ్రీ ఏటుకూరి బలరామమూర్తి అధ్యక్షతను ప్రగతిశీల రచయితల దృక్పథం అనే విషయంపై జరిగిన గోష్ఠిలో శ్రీ చలసాని ప్రసాద్ విప్లవ కవి శ్రీ సుబ్బారావు పాణిగ్రాహి 'దిక్కు మొక్కు లేని జనం – ఒక్కొక్కడు అగ్నికణం' అన్న గేయంతో తమ ప్రసంగాన్ని ప్రారంభించారు. ప్రగతిశీల రచయితలు ప్రజా పోరాటాలను అవగాహన చేసికోవాలని, సమాజంలో పీడనకు గురౌతున్న వర్గాల బాధలను అర్థం చేసుకోవాలని, సాహిత్యానికి – రాజకీయాలకు సన్నిహిత సంబంధం వుందని అన్నారు. శ్రీమహీధర రామమోహనరావు 'జమీందారీ వ్యవస్థను శ్లాఘించే తిరోగమన శీలంగల నవల 'వేయిపడగలు' అయితే ప్రగతిశీల దృక్పథంగల నవల ఉన్నవ వారి 'మాలపల్లి' అన్నారు. ఉన్నవ సమాజంలోని మార్పును ఆహ్వానిస్తూ వ్రాసిన తొలి అభ్యుదయ రచయితన్నారు. శ్రీ వేగుంట మోహనప్రసాద్ సాహిత్యం నిత్యచైతన్య వంతంగా వుండాలనీ ముందు చూపుతో ముందుకు నడిపేదే ప్రగతిశీల దృక్పథానికి గుర్తు అన్నారు.

శ్రీ టి. యల్. కాంతారావు శ్రీ శ్రీ మొదలగు అభ్యుదయ కవుల నుదహరిస్తూ, ఒక దశలో నిస్తబ్దంగా వున్న సమాజాన్ని తట్టి లేపింది దిగంబర కవిత్వం, ఆనాడు నిరసించిన వారే యీనాడు దాన్ని గుర్తించారని అన్నారు.

స్థానిక చక్రవర్తి ఆర్ట్స్ 'మరో మొహంజదారో' అన్న నాటికను చక్కగా ప్రదర్శించారు. ఈ నాటికను రచయిత శ్రీ ఎన్. ఆర్ నంది చూసి కళాకారులను అభినందించారు. అదే రాత్రి యువరచయితలతో శ్రీ శ్రీ గోష్ఠి జరిపారు. కవితలు విని ఆయన ఉత్సాహంగా ప్రసంగిస్తూ, తెలుగు సాహిత్యానికి యువతరమే ఆశాజ్యోతి అన్నారు.

చివరి రోజున ఉదయం జరిగిన సాహిత్యగోష్ఠికి శ్రీ చాగంటి సోమయాజులు అధ్యక్షత వహించారు. ఈ గోష్ఠిలో 30 మందికి పైగా యువ రచయితలు పాల్గొని స్వీయ కవితలను వినిపించారు. అందరి కవితల్లో ప్రధానంగా నేటి సమాజ పరిస్థితులపై కసి, ద్వేషం, జుగుప్సతోపాటు సమసమాజ నిర్మాణ వాంఛ, మానవాభ్యుదయం ప్రగతికి మార్గాన్వేషణ కనిపించాయి. కొందరి కవితలు ఆవేశమే కాక ఆలోచల్ని రేకెత్తించేవిగా వున్నాయి.

ఆ సాయంకాలం జరిగిన ప్రశ్నోత్తరాల కార్యక్రమ సభకు శ్రీశ్రీ అధ్యక్షత వహించారు. ఈ ముఖాముఖీ కార్యక్రమం రచయితలతో ప్రతినిధులకు చాల దగ్గర సంబంధాన్ని కలిగించి నూతనోత్సాహాన్నిచ్చింది. సాహితీ ప్రియులు రచయితలకు సూటిగా వేసిన ప్రశ్నలకు సమాధానాలు చాల ఘాటుగా నీటుగా వున్నాయి, శ్రీ అవసరాల రామకృష్ణారావును ఒకరు 'ఈ దేశంలో సాయుధ విప్లవం వస్తుందంటారా?' అని ప్రశ్నించారు! 'తప్పక వస్తుంది' అని సమాధానం యిచ్చారు. బలివాడ కాంతారావుగారికి 'గురజాడ' అన్నట్లు మంచి చెడ్డలు రెండు కులాలు కావు- రెండు వర్గాలని అంటాను. మీరు ఏ వర్గవైపున్నట్టు? అని ప్రశ్న. 'నా దగా పడిన తమ్ముడు' చదివివుంటే నేనే వైపో అర్థమవుతుంది, అని సమాధానం. ఒక పశ్నకు శ్రీవాకాటి పాండురంగారావు రచయిత చిత్తసంస్కారం బట్టి రచన వుంటుంది. మన సాహిత్యం నేడు పతనావస్థను సూచిస్తున్నది, రావల్సిన పారిజాతాలు మునుముందే పూస్తాయని భావిస్తున్నాను అని సమాధానం యిచ్చారు.

'దిగంబర సాహిత్యం సమాజానికి చేసిన దేమిటి?' అన్న ప్రశ్నకు శ్రీ చరబండరాజు, అది 1965 లో సాహిత్యం లోకంలోని స్తబ్ధతను తొలిగించి, సమాజాన్ని తట్టి లేపింది. 'మీరు వర్గశత్రు నిర్మూలన నమ్ముతున్నారా' అన్న ప్రశ్నకు, 'ఇది రాజకీయ పార్టీ కార్యకర్తలకు వేయవల్సిన ప్రశ్న, అయినా నాకు సంబంధించి నేను వర్గ శత్రునిర్మూలనను నమ్మటం లేదు' అన్నారు. 'నవయుగ రచయితలకు మీ సూచన ఏమిటి?' అన్న ప్రశ్నకు జ్వాలాముఖి ఏ రచనైన, ఏ గేయం అయినా ఆ స్థానిక వుద్యమాలకు అనుకూలంగా వుండాలి. ప్రజా వుద్యమాల - దశను- దిశను తెలియజేసేదిగా వుండాలి. గతంలో ప్రజా నాట్యమండలి -నేడు జననాట్య మండలి ప్రజల వద్దకు పోయి చైతన్యాన్ని కలిగిస్తున్నాయి. ప్రజల స్థాయికి తగిన విధంగా రచన సాగాలి అని అంటూ, బీనాదేవిగారి 'పెట్టుబడి' రా. వి. శాస్త్రిగారి 'పిపీలికం' వుదాహరణగా పేర్కొన్నారు 'రామాయణ విషవృక్షం' పీఠిక శాస్త్రీయంగా వుందన్నారు. విప్లవం అంటే ఏమి

మని ప్రశ్నించగా, జె. పి. గారిది విప్లవమే - కాని అది నక్సలైటు విప్లవానికి వ్యతిరేకమైనదని, కార్యాచరణే విప్లవ స్వరూప స్వభావాలను నిర్ణయిస్తుందనీ చెప్పారు. ఆ తర్వాత శ్రీ శ్రీ గతంలో గిడుగు, సెట్టి లక్ష్మీనరసింహం, గురజాడ ప్రభావం తనపై ఎలా పడిందో తెలియపరుస్తూ, బరంపురంలో ఆనాడు (1933) జరిగిన సాహిత్య సభలు ఒక చారిత్రాత్మక సంఘటనగా వర్ణించారు. బ్రిటిషు సామ్రాజ్యవాద పాలనలో దారుణ బాధలు వర్ణించి, యువతరాన్ని అదృష్టవంతులంటూ, స్వరాజ్యం వచ్చినా మన దేశం ఎంత అధ్వాన్నంగా వుందో చెబుతూ, చైనాలో తన పర్యటనానుభవాలను వివరించారు. పార్లమెంటరీ పద్ధతుల వల్ల పెట్టుబడిదారి ప్రధాన దుష్టపశ్వరూపం అంతం కాదు. కబుర్లు, కాగితాల్లోనే అభివృద్ధి కనిపిస్తుంది. కవులు కాదు - కార్మికులు - కర్షకులు విప్లవం తెస్తారన్నారు. నాకు భవిష్యత్తు మీద గొప్ప ఆశ వుంది, విశ్వాసం వుంది, అని శ్రీ శ్రీ ఉద్ఘాటించారు.

ఏక కాలంలో అనేక రసాలను సృజింపచేయటం గొప్ప కళ. అదే గురజాడలోని గొప్పదనం. అందుకే కన్యాశుల్కం శాశ్వతంగా వుంది - వుంటుంది అని చెప్పి, 1980 లో మరో ప్రస్థానం వెలువరిస్తున్నాను అని శ్రీ శ్రీ చెప్పారు.

శ్రీ శ్రీ సమ్మేళనం సోవెనీరును, శ్రీ జ్వాలాముఖి ఆంధ్ర సంస్కృతి సమితి రజితోత్సవ సంచికను ఆవిష్కరించారు, శ్రీ భమిడిపాటి రామగోపాలం, శ్రీ అక్కిరాజు రమాపతిరావు యీ మూడు రోజుల కార్యక్రమాలను సమీక్షించారు. ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజం ఉపాధ్యక్షులు శ్రీ కోకా సత్యనారాయణరావు, కార్యదర్శి శ్రీ ఇందుపూరి శ్రీరామమూర్తి సహకరించిన సంస్థలకు, వ్యక్తులకు కృతజ్ఞతలు తెలిపారు.

ఒట్టి మాటలు కట్టిపెట్టోయ్!
గట్టి మేల్ తలపెట్టవోయ్!
దేశమంటే మట్టికాదోయ్!
దేశమంటే మనుషులోయ్!

అన్న గురజాడ గేయం శ్రీ ధర్మపురి కృష్ణమూర్తి గానం చేస్తుండగా సమ్మేళనం ముగిసింది.

## వచన నిర్వచనం

ఎప్పుడూ
ప్రాసకోసమే తపస్సు చేస్తాడే
అతగాడే 'యతి'

చచ్చుశబ్దాల
జోలి కలవాడు 'జోగి'

అర్థాన్ని
వదిలేసిన వాడు 'సన్యాసి'

## ఇదీ పద్ధతి

వ్యాసుడు
మళ్ళీ యిప్పుడు పుడితే
ఈ సమాజం
అతణ్ణి వెలివేస్తుంది
వెక్కిరిస్తుంది.
భారతానికి నమస్కరిస్తూనే
కులోన్మాదం
పడగ విప్పుతుంది.

ఇజ్జాడ వెంకట్రావు

## అభ్యుదయ కవిత్వం - 'తిరుగుబాటు' ధోరణులు

(గత సంచిక తరవాత)

యువకవులు ధ్వజమెత్తని దుష్టసాంప్రదాయం ఒక్కటీ లేదు. వారి రచనలతో ఏమాత్రం పరిచయం వున్న వారికైనా యిది స్పష్టమే. ఇప్పుడున్నంత అధిక సంఖ్యలో సాంఘిక చైతన్యం వున్న కవులు, సాంఘిక శ్రేయస్సు కోసం హృదయ శుద్ధితో తపించిపోయే కవులూ మున్నెన్నడూ లేరన్నది కూడా నిజమే. వారి గీతాల్లోని ప్రతి పంక్తిలోనూ అనుమానానికి తావు లేకుండా యిది కనిపిస్తుంది. సామాన్య ప్రజల దుస్థితిని చూసి వారు పడిన ఆవేదన, వెనుకటి రోజుల్లో ప్రేయసి కోసం కల్పించుకున్న కల్లబొల్లి ఆవేదన కాదు. సాహిత్యం గర్వపడవలసిన సద్గుణం యిది కాని దీని వెను వెంటనే, విచారించవలసిన ఒక రీతి ఏర్పడుంది. అది, కొందరు కవులు ఒక మతంగా చేపట్టిన పరిభాష. అనేక దుష్ట సాంప్రదాయాలను నిరసించిన యువ కవులు ప్రబంధాలలోనూ, జుగుప్సకు పరాకాష్ఠ అయిన "చంద్రరేఖా విలాపం" లోనూ ప్రయోగింపబడిన పచ్చి బూతును తమ కావ్యాలలో పెట్టుకో వలసిన అవసరం ఏర్పరచుకున్నారు. దురన్యాయాలమీద సంధించడానికి యివే ఆయుధాలు కావాలా? ఇందువల్ల తమ సదుద్దేశాలకు వచ్చేది గౌరవమేనా? ఎక్కడో నోరు జారి బూతు మాట రావడం కాదు ఇవి కొల్లలుగా, అక్షయంగా ప్రయోగింపబడుతున్నాయి. తమ కోపోద్రేకాన్ని యితరత్రా వ్యక్తం చేయడం అసాధ్యం కాదు. దిగంబర కవుల కున్నటువంటి భావాలే ఇతర కవులు ఎంతో మంది వున్నారు, వారి ఆవేదన కూడా వీరి ఆవేదన వంటిదే అయితే వారీ పరిభాషను ప్రయోగించడం లేదు. సంఘంలోని కశ్మలం చూసి ఒళ్లు మండి "కారం పొర్లించిన రోకళ్లతో పట్టపగలు.... న అని అంతబలంగా తిట్టక తప్పదా? ఇది మనోవికారం కాదు గదా! గోవర్ధ" గిరిని బాలకృష్ణుడు వేలిమీద నిలబెట్టినట్టు పురుషాంగం మీద భూగోళాన్ని నిలబెట్టడమన్న ఉపమానం, మూల లక్ష్యం విషయంలో కవితో ఏకీభవించేవారు సైతం హర్షించరు. ఇటువంటి కవి ప్రయోజనానికి తోడ్పడుతుందా? బూతును ఒక రచనా పద్ధతిగా అలవరుచుకోవడం అవసరమా? పవిత్రమైన రౌద్రాన్ని ప్రకటించడానికిది తగిన పరిభాష కాదు.

'బూతు అశ్లీలం అని ఏదో నిరర్థకమైన సాకుతో వక్రభాష్యాలు తలకు రుద్ది-దిగంబర కవుల ఆవేదనను-నిజాయితీని శంకించే వాళ్లందరు యీనాటి కుష్టు వ్యవస్థకు ప్రతినిధులు. అసలు భాషలోని బూతును పతితులకు-పదదళితులకు-దగాపడిన తమ్ముళ్లకు-సామాన్య జనునికి యీ దోపిడీ వ్యవస్థ సాంస్కృతికంగా యిచ్చిన వారసత్వం. అశ్లీలమనే ప్రత్యేక భాష ఎక్కడా లేదు. అంతరార్థాన్ని,

ఉద్దేశాన్ని బట్టి భాష అశ్లీలం కావచ్చు. నిత్యజీవితంలోని భౌతిక-వాంఛలు, వాటి పరిపూర్ణత అశ్లీలమైతే మానవజీవితమే అశ్లీలం. ఇది బూతును సమర్ధించుకునే వైఖరి కాదు. కవికి వుండే భావవ్యక్తీకరణ స్వేచ్ఛ వివిధరకాల భాషా సాధనాలను అవలంబిస్తుంది. దిగంబరకవిత్వం యీ చారిత్రక సందర్భంలో అలాంటి బాధ్యతను నెరవేర్చింది. .. ''అని నిఖిలేశ్వర్ అభిప్రాయపడుతున్నారు (''దిగంబర దిక్పథం; ఒక మహత్తరమైన మార్పుకోసం'', ''భారతి', జూన్ 1970).

''కుష్ఠు వ్యవస్థకు ప్రతినిధులు'' కాని వారు, దిగంబర కవుల ఆవేదననూ నిజాయితీని శంకించనివారూ బూతు పరిభాషను హర్షించని వారు చాలామంది వున్నారు. దిగంబర కవుల అవేదనను హర్షించినప్పుడు, వారి పరిభాషను కూడా విధిగా ఆమోదించ నక్కరలేదు.

దోపిడీ వ్యవస్థ బూతును పతితులకు, దగాపడిన తమ్ముళ్లకు వారసత్వంగా యిస్తే, ఆ వారసత్వాన్ని దోపిడీ వ్యవస్థ శత్రువైన దిగంబర కవులు యీసడించ వలసిన దవుతుంది. అంతరార్థాన్ని బట్టి, ఉద్దేశాన్నిబట్టి మాత్రమే భాష అశ్లీలమైనప్పుడు, యీ పరిభాష వెనుకనున్న అంతరార్థాన్ని, ఉద్దేశాన్ని తరిచి చూడవలసిన శ్రమ పాఠకులకెందుకు కలిగించవలసి వస్తోంది? భావవ్యక్తీకరణ స్వేచ్ఛ కవికి వున్న మాట నిజమే గాని, దానిని సద్వినియోగం చేసుకోవడం మంచిది కాదా. మానవ జీవితం లోని భౌతిక వాంఛలు అశ్లీలమైనవి కావు. అలా అని అవి పందిరి యజ్ఞంలోనో, హిప్పీల విషయంలోనో తప్పితే, బహిరంగ ప్రదర్శనంగా వుండవు. ఈ భాషాసాధనాలు వీరి మూల ప్రయోజనానికి ఎంత మాత్రమూ దోహదకారులుగా లేవు. వీరు విప్లవ రచయితలతో కలిశాక యీ వైఖరిని సరిదిద్దుకున్నారు.

## అవ్యవస్థ పైని తీవ్రద్వేషం

అభ్యుదయ రచయితల మనుకున్నా అనుకోక పోయినా, ప్రతి యువ కవీ యిప్పుడు, వివిధ స్థాయీ భేదాలలో, భిన్నభిన్నమైన అవగాహనలతో సంఘ అవ్యవస్థనూ, అవినీతినీ, అన్యాయాలనూ ద్వేషిస్తున్నాడని; యీ దుష్ట వ్యవస్థ నిర్మూలనకు తపిస్తున్నాడని యీనాటి కవిత్వం చదివినవారికి తెలుస్తుంది. అటువంటి ఉదాహరణలు అనేకం పైని యివ్వబడ్డాయి. యువకవులు అసంతృప్తినీ అశాంతినీ ఊపిరితో వదలుతున్నారనీ; అవ్యవస్థను, అన్యాయాల్ని భరించలేక మండిపడుతున్నారనీ వీటివల్ల స్పష్టపడుతుంది.

సమాజంలో వున్న పరిస్థితి విపరీతమైన నిరాశకు, కోపతాపాలకు, అశాంతికీ, అరాచకానికీ కారణంగా వుంది. ఈ పరిస్థితి ఈ ఒక్క రాష్ట్రంలోనే కాదు, దేశంలోని అన్నిరాష్ట్రాలలోనూ వుంది. అమెరికా, ఇంగ్లండు, పశ్చిమ జర్మనీ, ఫ్రాన్సు, జపాను మొదలైన దిట్టమైన ధనికరాజ్యాలల్లో, ముఖ్యంగా యువకుల్లో యిది ఆవరించివుంది. సమ్మెలు, తిరుగుబాట్లు, వీధుల్లో కోపోద్రిక్తతతో ప్రదర్శనలు, ప్రభుత్వ యంత్రాంగంలో సంఘర్షణలు దీని ఫలితాలు. ఎక్కువగా యిది సాంఘిక ప్రయోజనాన్ని ఆశించిన సాంఘిక చైతన్య ఫలితం. కోపోద్రిక్తులైన

యువకవులు, హిప్పీలు, బిట్నిక్కులు కూడా యీ అవ్యవస్థ ఫలితాలే. ఇటువంటి కల్లోలంలో నియమాలన్నిటినీ — చెడ్డవాటితో బాటుగా మంచివి కూడా తెంచి వేయడమూ జరుగుతోంది. వెనకా ముందు చూడకండా గుండంలోకి ఉరకడమూ జరుగుతోంది. సంఘంలోని యీ పరిస్థితి సాహిత్యంలోనూ వచ్చిందంటే ఆశ్చర్య పడనక్కరలేదు.

నేటి తెలుగు అభ్యుదయ కవిత్వంలో లోకంలో నేడున్న తీరు, ఉగ్రత ప్రతిధ్వనించడమూ, ప్రతిబింబించడమూ అసహజ మేమీ కాదు. దేశంలోని దుస్థితి, అవ్యవస్థ మూలకారణంగా వుండనే వున్నాయి. ఈ అవ్యవస్థకు వ్యతిరేకంగా పోరాటం, దాని పైని తిరుగుబాటు అభ్యుదయ కవిత్వంలో ఏవిధంగా ప్రతిబింబించినదీ యింతకు ముందర ప్రస్తావించ బడింది; భాష, శైలి, పరిభాష మొదలైన విషయాల్లో కనబడుతోన్న కొన్ని కొన్ని బలహీనతలను సూచించడం జరిగింది.

భాషకంటె, శైలి కంటె ముఖ్యమైనది కావ్య వస్తువు. దుస్తుల కంటె శరీరం, ప్రాణం ముఖ్యం. అందుచేత యువ కవులు తమ రచనలలోని వస్తువును గురించి అన్నిటి కంటె ఎక్కువగా శ్రద్ధ చూపవలసి వుంటుంది. వారి నిప్పువంటి కోపం, వారి మహావేశం వారు దేశ పరిస్థితిని, ప్రగతి శక్తుల బలబలాలను సరిగా అవగాహన చేసుకోవడానికి అడ్డం కాకూడదు. దేశంలో పురోగమిస్తున్న ప్రగతి శక్తులలో ఒక భాగమైన యువ కవులు, కార్యరంగంలో ప్రగతి శక్తుల కదనుకు తమ కవితను వివేచనతో, తాత్వికావగాహనతో మేళవించ వలసి వుంటుంది. యువకవుల సంకల్పమూ అదే. ఈ సంకల్పం చాల వరకూ జయప్రదంగానే సాగుతూ వున్నది. అయితే అవగాహన సంపూర్ణంగా ఎలప్పుడూ వుండడం లేదు. కార్యరంగం లోని ప్రగతి శక్తులు భౌతిక పరిస్థితుల్ని పట్టించుకోకండా నిగ్రహం కోల్పోయి, బలా బలాలు, సాధ్యా సాధ్యాలూ కానకండా నేల విడిచిన సాము ఎందుకు చేయకూడదో అందుకే, కావ్య రంగంలోని ప్రగతి శక్తులకు చెందిన యువ కవులూ నిగ్రహం లేకుండా వ్యవహరించకూడదు. ఉచితానుచితాలేవో ఆలోచించాలి.

దురన్యాయాలను నాశనం చెయ్య గల సత్తాను సంపాదించుకోనిదే, విచక్షణ లేకుండా, సమయాసమయాలు గమనించకుండా తలపడడం నేల విడిచిన సాము అవుతుంది; తొలి సోషలిస్టు విప్లవాన్ని జయప్రదం చేసి, తొలి సోషలిస్టు సమాజాన్ని ప్రతిష్ఠించిన లెనిన్ కూడదన్న బాల్యారిష్ట మవుతుంది. అది పరాక్రమం కావచ్చును గాని ప్రయోజకత్వం కాదు. పాపం పండి దేశంలోని దుర్భరమైన పరిస్థితులు విప్లవాన్ని తక్షణం కోరే విధంగా వున్నాయా, ప్రజా బాహుళ్యం యిందుకు సిద్ధంగా వున్నదా, యిందుకు కావలసిన సన్నాహం జరిగిందా, రానురానూ చీలుతూవున్న ప్రగతిశక్తులు యీ బాధ్యతను నెరవేర్చే స్థితిలో వున్నవా, ప్రగతిని నిరోధించే శక్తులు ఏ స్థితిలో వున్నాయి, తమ బలమూ శత్రువుల బలమూ కానకండా తలపడడం మంచిదేనా — యిటువంటి అనేక ప్రశ్నలకు స్థిర చిత్తంతో, స్వీయ మానసిక ధోరణికి లోను

కాకుండా జవాబు చెప్పుకోవలసిన విజ్ఞాన అవసరం. ఏ ఉద్యమ సాఫల్యానికైనా ఎంత పవిత్రమైన దైనా, ఎంత కాంక్షించ దగ్గదైనా ఆవేశమొక్కటే చాలదు.

శ్రీశ్రీ "విప్లవ శంఖం పలికించారోయ్" అని ఏనాడో చేసిన ప్రకటన లోని విప్లవాశయానికి యిప్పటి విప్లవాశయానికి తేడా వుంది. అనాటి సమీప లక్ష్యం, స్వాతంత్ర్యం, శ్రామిక రాజ్యం ఆదర్శం మాత్రం బ్రిటిష్ పరిపాలనను, ధనిక పీడనను ఒకేసారి వదుల్చుకునే పరిస్థితి అనాడు లేనే లేదు. చరిత్ర నిరూపించింది కూడా అదే. అయితే ఆ గీతం ప్రపంచ పీడిత తాడిత శక్తులు సోషలిస్టు సమాజ స్థాపన కోసం సాగించే సమరాన్ని సూచిస్తుంది. ఇప్పటి విప్లవాశయం శ్రామిక రాజ్యం. "జరుగుబాటు గాకపోతె తిరుగుబాటు జెయ్యండి" అని చెప్పేటప్పుడు, "నెత్తుటిలో అత్తరు స్నానం" గురించి చెప్పేటప్పుడు, దూకుడు వల్ల కలిగే లాభ నష్టాల్ని బేరీజు ముందుగా వేసుకోవడం, ప్రగతి శక్తుల ఉద్యమానికి శ్రేయస్కరంగా వుంటుంది.

"తల్లి గర్భ శోకంలా సూటిగా, నగ్నంగా చెప్పబడే సత్యాలు", "ఈ దేశంలో, యీ గోళంలో ఊపిరి పీల్చే ప్రతి మనిషి ఊపిరి కోసం తపనపడి, అతడి భావిని చూసి ఏడ్చి,పిచ్చెక్కి ప్రపచించిన కవితలు" (చూ. దిగంబర కవుల సంపుటాలు) కవుల సున్నితమైన మనస్సుకు, అన్యాయాలను చూసి ఓర్చుకో లేని దయా గుణానికి ప్రతిబింబాలవుతాయి ; పర్యవసాన పరిజ్ఞానానికి సూచనలు కావు. యువకవుల బాధ్యత ఎక్కువ. వారి కవితా వస్తువు ఊహా పేయసి కాదు, అర్థం లేకపోయినా కమ్మగా పాడె కోకిల పాట విని పరవశమై పోవడమూ కాదు. వారెంత మాత్రమూ కాల్పనికులు కాకూడదు. అందుచేత తమ కావ్య వస్తువుల గురించి సంపూర్ణ పరిజ్ఞానం, యుక్తాయుక్త విచక్షణా వారికవసరం అధివాస్తవిక కవుల్లాగా అర్ధచైతన్యంలోనూ, కాల్పనిక కవుల్లాగా అసలు చైతన్యమే లేకుండానూ చేసే పని కాదు వారిది. సంపూర్ణ చైతన్యంతో వుంటూ చేసే పని వారిది. భావ తీవ్రత కీడుకు దారితీయ కూడదు గదా. జయించడానికి కట్టుదిట్టాలని చేసుకోకుండా ఉద్యమించి దెబ్బతిన్న తరువాత, జరిగే కీడు, ఆ అపజయం కలిగించే నిరాశ, నిస్పృహ అనుభవంలో, చరిత్రలో నమోదై వున్న విషయాలే.

ప్రగతి అన్నది,రూళ్ల కాగితం మీద ముత్యాల కోవంటి దస్తూరీ లాగా సాగి పోయేది కాదు. వంకర టింకరు, ఎగుడు దిగుళ్ళు వచ్చే అవకాశం లేక పోలేదు. వాటిని గమనించి దిద్దుకోలేకపోతే, జరిగే ముప్పును సర్దుకోవడానికి ఎంతో కాలం అవసర మవుతుంది.

కొత్త యుగం వచ్చింది, పాతయుగం పోయింది. పాత యుగధర్మమూ పోతోంది. వచ్చిన కొత్త యుగంతో ఆ యుగ ధర్మం కొత్తది వచ్చింది ఆ కొత్త యుగ ధర్మాన్ని పెంపు చేసే విధంగా, లక్ష్య శుద్ధితోనూ, అడుసు నేలలు చూసుకుంటూనూ వ్యవహరించడం కంటె, వేరే పరమార్థం ఏ ఉద్యమానికీ ఉండదు.

(సమాప్తం)

(రచనా కాలం 1970 జూన్, కొద్దిగా మార్పులతో)

# వేన్నీళ్లకు చన్నీళ్లు

## కథానిక

శివలెంక ప్రకాశరావు

"గోపాలరావు గారు ఇంకా రాలేదా? ముహూర్తం సమీపిస్తోంది" అంటూ హడావిడిపడుతూ లోపలికీ బయటికీ తిరుగుతున్నాడు పురోహితుడు.

"ఇంకా గోపాలం రాలేదటే సీతమ్మా!" అంటూ దీర్ఘాలు తీస్తూ మరదలిని అడుగుతోంది ఆడబడుచు అనంతమ్మ.

"వాడెందుకొస్తాడే నాకు తెలుసు. డబ్బు చేతిలో పడ్డదిగా, ఏ క్లబ్బుకో పోయుంటాడు" అన్నాడు ఉక్రోషాన్ని వెళ్ళగక్కుటూ పెద్దన్న సుబ్బారావు గారు.

"లేదండీ! వెంటనే వచ్చేస్తానని మరీ మరీ చెప్పి వెళ్ళారు. ఏదో ముఖ్య కారణం ఉండి ఉంటుంది వారి ఆలస్యానికి" అంటూ సర్దిచెప్పబోయింది మరదలు సీతమ్మ.

"ఆ! నీ పిచ్చి గాని వాడెక్కడొస్తాడమ్మాయి. నువ్వు అలాగే మొదటి నుంచీ వెనకేసుకు రాబట్టే ఏ బాధ్యతా లేకుండా ఉన్నాడు వాడు. ఆరుగురు ఆడ పిల్లల తండ్రి అయినా, నలబై ఏళ్లు నెత్తిమీది కొచ్చినా నిమ్మకి నీరెత్తినట్టు ఉన్నాడు" అంటూ రంకెలు వేశారు సుబ్బారావు గారు.

దాంతో ఎవరూ నోరెత్తలేక పోయారు ఇంతలో విడిది యింటి నుంచి "కాఫీలు ఇంకా అందలే"దంటూ కబురు. "మంగళ సూత్రాలు సిద్ధపరచారాఅండీ" అంటూ పురోహితుడి ఎన్‌క్వయిరీ.

"కాలి గోళ్లు తీసేటప్పుడు కొత్త తుండు వెయ్యండమ్మా" అంటూ చాకలి హుకుం.

"కూరలింకా రాలేదండోయ్ అదీ కాక భోజనాలు పెందలాడే కావాలన్నారు పెద్దయ్య గారు" అంటూ వంటవాడి ఫిర్యాదు.

"మంగళా స్నానాలకు ఏర్పాటు చేయమంటున్నారు" అంటూ పెళ్లి కొడుకు తండ్రిగారి సందేశం.

"పెళ్లికుమారుడి ఫ్రెండ్స్ వచ్చారట! వాళ్లకు వేన్నీళ్లు అవీ ఏర్పాటు చేసి, వెంటనే టిఫిన్ రడీ చేయమంటున్నారు. అసలే వాళ్లు రాత్రి భోంచేయలేదట!" అంటూ మరో కబురు.

ఇవన్నీ చూస్తుంటే మతిపోయింది సుబ్బారావుకు. ఇంకా వెళ్లిన తమ్ముడు రాలేదు. పోనీ తానైనా ఏదన్నా సర్దుబాటుచేసి సరుకులూ అవీ తెప్పించుదామా అంటే రెండు నెలలనుంచీ జీతం రాక అఘోరించే బడిపంతుల ఉద్యోగం తనది. పిల్లకి చదివించాలిసిన పది రూపాయలకే పదిమందిని యాచించాలిసి వచ్చింది. రెండో తమ్ముడేమైనా సర్దుతాడేమో అంటే వాడు పెళ్లాం చేతిలో కీలుబొమ్మ. మూడో వాడు సరేసరి. తిరుపతి వెళ్లి పెళ్లి టైముకు వీలయితేవస్తానంటూ టెలిగ్రాం ఇచ్చాడు ముందుగానే జాగ్రత్త పడుతూ.

పరిస్థితి తారుమారయింది. పరువు బజారున పడేటట్టుంది. అదీకాక ఊళ్లో పెద్ద మనుషులుగా చెలామణీ అయ్యే కొందరు అప్పుడే "ఏమయ్యా! మీ

తమ్ముడు రాలేదట! ఏమిటీ విశేషం. అటుంనుంచి అటే ఎటన్నా....'' అర్థోక్తిలో వ్యంగ్యోక్తులు మొదలెట్టారు. అనరూ మరి! లోకులు కాకులు గదా!

అయినా వాళ్ల తప్పేముంది? గోపాలరావు సంగతి అందరికీ తెలిసిందే! పది రూపాయలు కనబడితే ఊళ్లో ఉండడని!

గోపాలరావు చేసే ఉద్యోగం గుమాస్తాగిరే! వచ్చే దానికి పది రెట్లు ఖర్చు ఇంట్లో. గంపెడు సంసారం. ఏం చేస్తాడు పాపం! అందుకే కాస్త పెట్టుబడితో ఎక్కువ లాభదాయకంగా ఉంటుందనే పిచ్చి నమ్మకంతో బ్రాకెట్ కంపెనీకీ, పేకాట మొదలైన జూదాలకూ అలవాటుపడ్డాడతడు. జూదంలో వచ్చే డబ్బే లెక్కిస్తారు. కాని పోయిన డబ్బుకు లెక్క ఉండదు కదా మరి! వేన్నీళ్లకు చన్నీళ్ళు తోడవుతాయని ఏదో ఆశ పాపం గోపాలరావుకు! అందుకే ఒక్కోసారి ముఖ్యంగా నెలలో మొదటి వారం రెండుమూడు రోజుల కొకసారి గాని ఇంటి మొహం చూడడు.

ఏది ఎలావున్నా పెద్దన్నగారి పట్టుదలవల్ల పెళ్ళికెదిగికూచున్న ముగ్గురిలో పెద్దదానికి సంబంధం కుదిరింది. పెద్దల ఆస్థి ఏనాడో హారతి కర్పూరం అయింది. అంతా రెక్కలమీదే ఆధారం. అందుకే గోపాలరావు చేసేదిలేక తప్పించుకు తిరిగాడు చాలా రోజులు.

ఎలాగయితేనేం! కాస్త స్తోమతుగల అక్క గారు ఖర్చంతా పెట్టుకుంటాననడంతో అన్నింటికీ గంగిరెద్దులా తలూపాడు. క్రిందటి రోజే ఖర్చులకని అయిదు వందలు చేతిలో పోసింది ఆమె. బయటపడ్డాడు గోపాలరావు.

చెయ్యి తిరిగితే పెళ్ళి ఇంకా ఘనంగా చెయ్యొచ్చని క్లబ్బుదారిపట్టాడు. ఈసారి పెద్దజట్టులో కూచున్నాడు. మొదట రెండు వందలదాకా వచ్చాయి. దాంతో ఇంకా ఆశ కల్గింది గోపాలరావుకు. అలాగే ఆడసాగాడు. తెచ్చిన దానిలో మూడొందలు పోయాయి. కసి పెరిగింది. ఇంకా ఆడుతూనే ఉన్నాడు. తెల్లారే సరికి ఒక్క పది నోటు బిక్కుబిక్కుమంటూ తొంగి చూస్తోంది జేబులోంచి. అప్పటికి కాని తన స్థితి గుర్తు రాలేదు గోపాలరావుకు. ఇంకేం ఇంటికెళ్తాడు!

పరిస్థితి విషమించిందని తెలిసికొన్న అక్కగారు, చాటుగా సుబ్బారావును పక్కకు పిలిచి ''అన్నయ్యా! ఏమనుకొనీ లాభం లేదు. వాడు వచ్చేదాకా పెళ్ళి ఆగదు. ఈ నాలుగొందలూ తీసుకొని వెంటనే ఊళ్లో ఉన్నంతవరకూ సామాను తెప్పించు. పది రూపాయ లెక్కువైనా సరే! పని నడుస్తూ ఉంటుంది. ఇంతలో వాడొస్తే సరేసరి. లేదా అంతా అభాసుపాలు అవుతాం'' అంటూ రొండిన దాచిన నాల్గు నోట్లు అందించింది.

ఏనుగంత బలం వచ్చింది సుబ్బారావుకు. వెంటనే అన్ని ఏర్పాటూ చేశాడు క్షణంలో.

కనీసం కన్యధార వేళకయినా గోపాలరావు వస్తాడోరాడోఅని అంతా ఎదురు చూడసాగారు. అవసరమయితే దానికి సిద్ధమయాడు సుబ్బారావు. ఏంచేస్తాడాయన? ఏదో కట్నంలేకుండా పిల్లాడు రెండో పెళ్ళి వాడయినా దొరికాడు కదా అంటే ఈ అవాంతరం వచ్చి పడింది. మళ్ళీ ఇలాంటి సంబంధం దొరకదు.

పెళ్ళి పీటలు సిద్ధపరిచారు. పిలిచిన వారంతా వేషాలువేసుకొని వస్తున్నారు.

ఇంతలో .... సైకిలు గంట మోగింది. చిన్నగా దిగాడు గోపాల రావు. మొహం పీక్కుపోయింది. ప్రాణాలు కళ్ళల్లో ఉన్నాయి. తూలి పోతున్నాడు. పెరిగిన గడ్డం, చిరిగిన గుడ్డలు.

అందరూ అతని వెనకాల వచ్చే సామానుకోసం దిక్కులు చూశారు. అతని పరిస్థితిని చూసి అడుగుదామను కున్నవారు నిర్ఘాతపోయారు. వేడి కాఫీ యిచ్చి సేద తీర్చారు.

అర్థం చేసుకున్న పెద్దన్నగారి హుంక రింపుతో అందరూ మామూలుగా తమ పని తాము చేసుకోసాగారు. "సమ యానికి వచ్చాడు. అంతే చాలు" అనుకున్నారు చుట్టాలు.

నిరాటంకంగా పెళ్ళి జరిగింది అనిపించాడు సుబ్బారావు గారు.

అయితే పట్టుకెళ్ళిన డబ్బంతా క్లబ్బుకు చేరిందని ఒక్క సీతకే తెలుసు.

పాపం! ఏంచేస్తుంది?

చేసుకున్న వారికి చేసుకున్నంత మహదేవా!

## వ్యత్యాసం

### వై. పురుషోత్తమ రెడ్డి

ఈ కిటికీలో నుండి చూస్తున్నా -
చింకి పాతల దుస్తులేసి
కూడులేని బొచ్చె బట్టి
బిచ్చానికి పయనమైన
కటిక దరిద్రుడు
కడుపు మంటలో
తుంట బీడీ ముట్టించు కోవడం -

కాయంలో తడినంతా
డబ్బులకై విక్రయించి
సారాతో శరీరాన్ని
తడిచేసుకు బతుకుతూన్న
లేని వాన్ని -
కుటుంబాన్ని పోషించలేని వాన్ని -

శరీర పోషణకై -
సంఘంలో నీచంగా
వీధుల్లో 'ఛీపు'గా
శరీరాన్ని అమ్ముకునే
అమ్మల్ని, దిగజారిన రొమ్ముల్ని -

తన తాతల 'స్టేటస్సు' ను-
నిలుచో బెట్టేటందుకు;
నలుగురిలో మెప్పుకొరకు
అభిమానం లప్ప కొరకు -
గొప్పలు పోయి
అప్పుల పాలయిన అప్పారావ్
తనలో తనుగొణుక్కుంటూపోవడం

ఊరకుక్క లూరకనే
కాట్లాడుకు చస్తూంటే
ఎదురింట్లో వేటకుక్క
విలాసాతి దరహాసపు చూపుజూసి
నిశ్చలంగా 'భౌవ్'కరించడం-

సింపుల్‌గా ముస్తాబై
ఇంపాలా కారులోన
జంపాలా లూగుతున్న
కంపులరావుని -
వాడి ఇంపోర్టెడ్ వైఫ్‌ని -

కాని -
ఒక అనుమానం-
దేవుడి దృష్టిలో అందరూ సమానం
మరి ఈ కిటికీలో ఎందుకీవ్యత్యాసం?

# కిట్టీ - సోమర్ సెట్ మామ్ అపూర్వ సృష్టి

వై. వెంకటరామయ్య

ఆధునికాంగ్ల నవలా రచయితలలో సోమర్ సెట్ మామ్ అగ్రగణ్యుడు. 1874లో ఫ్రాన్స్‌లో జన్మించి, పదేళ్ళవరకు అక్కడే పెరిగాడు. ఆ తర్వాత బ్రిటన్‌లో మెడిసిన్ చదివాడు ; కాని ఎపుడూ ప్రాక్టీస్ చెయ్యలేదు. రచయితగా స్థిరపడ్డాడు. వివిధ దేశాలలో సంచరించాడు; మానవజాతిని బాగ పరిశీలించాడు. నవలాకారునిగా 'ఆఫ్ హ్యూమన్ బాండేజ్' (మానవబంధం) అతనికి ఎంతో యశస్సును ఆర్జించి పెట్టింది. "ది మూన్ అండ్ సిక్స్ పెన్స్", "కేక్స్ అండ్ ఏల్", "రేజర్స్ ఎడ్జ్" 'ది పెయింటెడ్ వేల్' అతని నవలలో ముఖ్యమయినవి. అతడు నాటకకర్తగా, కథానికా రచయితగా కూడా పేరు సంపాదించుకున్నాడు.

మామ్ మెడిసిన్ చదివే రోజులలో సెలవులకు ఫ్లోరెన్స్ వెళ్ళాడు. అక్కడ ఇటలీ మహాకవి డాంటే వ్రాసిన 'డివైన్ కామెడి' అనే కావ్యాన్ని చదువుతున్నప్పుడు అందులోని ఓ కథ మామ్‌ని ఎంతో ఆకట్టుకుంది. పియా ఒక గొప్పింటి స్త్రీ. శీలాన్ని శంకించి ఆమె భర్త, ఆమెను చంపటానికి భయపడి, మారెమ్మ అనే సుదూర కోటకు తీసుకెళ్ళాడు. అక్కడి విషపు గాలులు ఆమెను చంపగలవని అతని నమ్మకం. కాని చాల రోజులు గడిచినప్పటికి ఆమె చనిపోలేదు. విసుగుచెంది, ఆమెను కిటికీ ద్వారా పారవేయిస్తాడు. ఈ కథని మామ్ తాను తర్వాత చైనా వెళ్ళినప్పుడు అధుని కథగా వ్రాయటానికి నిశ్చయించుకున్నాడు.

కిట్టీ 'పెయింటెండ్ వేల్' లోని కథానాయిక. చాల మంది ఆధునిక యువతుల వలె అందంగా కన్పించి, భాగ్యవంతులయిన యువకుల హృదయాల నాకర్షించటమే స్త్రీ జీవిత లక్ష్యమనే విధంగా కిట్టిని ఆమె తల్లి పెంచింది. సమాజంలో భర్త సాంఘిక స్థితిని బట్టి స్త్రీ గౌరవించబడుతుంది. దురదృష్టవశాత్తు ధనవంతుడయిన భర్తను పొందలేక కిట్టీ ఒక సామాన్యమయిన డాక్టరును వివాహమాడుతుంది. ఆశ్రయంకోసం అతనిని వివాహమాడిందే కాని తనని అమితంగా ప్రేమిస్తున్న ఆ భర్తను ప్రేమించలేక పోయింది. దంపతుల మధ్య ఉండే పవిత్ర బంధాన్ని వమ్ముచేసి, ఛార్లెస్ అనే అందగానితో తిరుగుతుంది.

ఆ రహస్యం తెలుసుకున్న ఆమె భర్త, ప్రాచీన కథలలోవలే, ఆమెను చంపలేదు; ఆమెను విడనాడలేదు. "నీ ప్రియుని వివాహమాడు ; లేదా నాతో చైనా రా" అని సవాలు చేస్తాడు. వివాహితుడయిన తన ప్రియుడు అతని భార్యకు విడాకులిచ్చి, తనను తప్పక వివాహం చేసుకుంటాడని ఆమె ధీమా! కాని అతడు కామించాడే గాని ప్రేమించలేదని తెలుసుకున్న కిట్టీ, నిరాశా నిస్పృహలతో తన భర్తతో చైనా వెళుతుంది. అక్కడి ప్రజలు కలరాతో ఈగల వలె చనిపోతున్నారు.

కిట్టీ పశ్చాత్తాపంతో దహించుకుపోతున్నది. కాని వాల్టర్ ఆమెను దగ్గర చేర

దియ్యాడు. అక్కడ వాడింగ్టన్ అనే ఆంగ్లేయునితో పరిచయమవుతుంది. అతడు పొట్టిగా వికారంగా వుంటాడు. కాని అతనిని ఓ అందమైన చైనా స్త్రీ ప్రేమించి, వివాహం కాకుండానే అతనితో దాంపత్యజీవితం గడుపుతున్నది. నిజమైన ప్రేమే మిటో కిట్టీకి అప్పుడర్థమవుతుంది. ఒక రోజున కిట్టీ కాన్వెంటుకి వెళ్ళి మదర్ సుపీ యర్ అనే క్రైస్తవ మిషనరీ స్త్రీని కలుసుకుంటుంది. మదర్ సుపీరియర్ తన అనుచరులతో, కలరాతో బాధపడుతున్న చైనా ప్రజలకు సేవచేస్తున్నది. వారి ఆత్మత్యాగం కిట్టీని ప్రభావితం చేసుంది. అందరూ ఆమె భర్తను భగవంతుడు పంపించిన దూతగా పరిగణిస్తారు. తన వ్యర్థజీవితానికి చింతించి, కిట్టి మానవ సేవలో తన దుఃఖాన్ని మరచిపోవడానికి ప్రయత్నిస్తుంది.

వాల్టర్ రాత్రింబవళ్ళు తన ఆరోగ్యాన్ని కూడా లెక్కచెయ్యకుండా, అక్కడి ప్రజలకు వైద్యసహాయం చేస్తుంటాడు. అతడు ఆత్మహత్యకు తలపడినట్లుంది. కిట్టీ గర్భవతవుతుంది. ఆ సంగతి తెలుసుకొన్న వాల్టర్ కిట్టీని అడుగుతాడు: "ఆ బిడ్డకు నేనేనా తండ్రిని?" అని. ఏమి చెప్పగలదామె? అసత్యం చెప్ప దలుచుకోలేక, "నాకు తెలియదండి" అంటుంది. నవ మాసాలు మోసి బిడ్డను కంటుంది స్త్రీ. మగ వాడు తన క్షణికమైన సంబంధంలో సృష్టికర్త ననుకుంటాడు; ఎంత విచిత్రం!

నూతనోత్సాహంతో ముందుకు పోతున్న కిట్టీతో విధి క్రూరంగా చెలగాట మాడుకుంది. వాల్టర్ కలరాతో చనిపోతాడు. తన భర్త చనిపోయే ముందు, కిట్టీ తనని క్షమించమని ప్రార్థిస్తుంది. "కుక్క చనిపోయింది" అని అతడంటాడు. అతని

మాటలకు భావం ఏమిటో అర్థం కాలేదు. (ఒక పిచ్చికుక్క ఒక మనిషిని కరిస్తే, ఆ మనిషి కోలుకున్నాడు గాని ఆ కుక్క చనిపోయింది. అలాగే చనిపోతానని భయపడిన కిట్టి బ్రతికింది; కాని వాల్టర్ చనిపోయాడు. ఇది వాల్టర్ భావం.) మదర్ సుపీరియర్ కిట్టిని ఓదార్చి, హాంగ్‌కాంగ్ వెళ్ళమనిచెప్పి, ఒక సలహానిస్తుంది. మన ధర్మాన్ని మనము నిర్వర్తించడం మురికిగా వున్న చేతులను శుభ్రంచేసుకోవడమే. ధర్మాన్ని ప్రేమతో ఆచరించినప్పుడే మన జీవితం ఆనందమయమవుతుంది. హాంగ్‌కాంగ్‌లో అందరూ కిట్టి ధైర్యాన్ని ప్రశంసిస్తారు; ఆమె దురదృష్టానికి సంతాపము తెలియజేస్తారు. ఆమె పాత ప్రియుడు ఛార్లెస్ ఆమెను మరల లొంగదీస్తాడు. ఈసారి కిట్టీ ఛాన్‌ని నిందించక తననే నిందించుకుంది, ఇంకా తనలో వున్న పశుత్వం చనిపోలేదని.

హాంగ్‌కాంగ్‌ని వదలి, కిట్టి లండన్ వెళుతుంది. ఆమె తల్లి చనిపోయింది. తన తండ్రి దూరదేశానికి చీఫ్ జస్టిస్‌గా వెళ్ళుతున్నాడు. తాను కూడ తన తండ్రితో వెళ్ళిపోవటానికి నిశ్చయించుకుంటుంది. నూతన్న పరిసరాలలో నూతన్న జీవితం ప్రారంభించాలి. తనకు పుట్టబోయే బిడ్డ తప్పక అమ్మాయే అవుతుంది. తన కుమార్తెను తాను ఒక మగవాని భార్యగా మాత్రమే కాక ఒక వ్యక్తిత్వమున్న స్త్రీగా దిద్దాలి. అదే ఆమె ఆశయం.

ది 'ది పెయింటెడ్ వేల్ 'అంటే రంగుల ముసుగు. ఈ ఆధునిక సమాజంలో కూడ చాల మంది తలితండ్రులు తమ కుమార్తెల్ని అందమైన దుస్తులు వేసుకున్న బొమ్మల్లా పెంచుతున్నారు. ఏవిధంగాను స్త్రీ పురుషునికి తీసిపోదు. స్త్రీ పురుషునితో సమాన స్థాయిలో నిలబడాలంటే ఆమె ఆ రంగుల ముసుగును విసరివేసి, తనలో అచేతనంగావున్న గుణాల్ని వెలికి తీసి, జీవితాన్ని సరిగా, పూర్తిగా చూడగలగాలి. అప్పుడే సమాజంలో స్త్రీ గౌరవింపబడుతుంది.

ఆంగ్ల నవలా ప్రపంచంలోనే అపూర్వమనదగిన పాత్ర మామ్ సృష్టించిన కిట్టీ పాత్ర. ఫ్రెంచి నవలా రచయిత ఫ్లాబర్ట్ సృష్టి 'మాడమ్ బవరీ'తో సరితూగేది.

## పాపం లేనోళ్ళు

### యన్నంరెడ్డి వెంకటరెడ్డి

ముప్పయ్యేళ్ళు జరిగాం –
విముక్తి కంకణాల బంధనాల తెంచుకు !
వత్సరాలు జరిగినా –
మత్సరాలు తరగలేదు
ముప్పయ్యే కాదు -
మూడు ముప్పయిలు దాటినా
విభేదాలు మాసిపోవు -
విషాదాలు సమసిపోవు !
ఉన్నవాళ్ళు లేనివాళ్ళనే భేదాలు
పోనే పోవు !!
ఉన్నవాళ్ళు ఉన్నవాళ్ళు
ఊసులాడుకొంటున్నారు !
లేనివాళ్ళు ఆనవాళ్ళు లేకుండా
పోతోన్నారు
కలవాళ్ల కారుల రేపిన ధూళిలో పడి
కానరావడం లేదు —
పాపం లేనోళ్ళు ! !!

# ఎర

**కథానిక**

**చామర్తి దుర్గాప్రసాద్**

"ఇది నా భూమి. నా తాత ముత్తాతల దగ్గర్నుంచీ అందరం కష్టంతో పండించి ఈ నేల మీద నెత్తురుతో శుద్ధి చేసి మరీ దేవతలా చూసుకున్నాం. నా దేవతని నా నుంచి ఎవరూ లాగేయ లేరు."

భూమయ్య అరుపులు అమీనాకి నవ్వు తెప్పించాయి. అమీనా పక్కనే నిల్చున్న ఆసామికి కోపాన్ని తెప్పించాయి.

ఆ ఆసామి పట్నంలో కాపరం ఉండి - వ్యాపారం చూసుకుంటూ పల్లెలో తన పొలాన్ని కౌలుకి ఇచ్చిన వాడు. ఆ కౌలు తాలూకు డబ్బు ఎప్పటికప్పుడూ ముట్ట చెబుతూనే ఉన్నాడు భూమయ్య ఇంత వరకూ. అయినా ఆ భూమి తనదేనని భూమయ్య అనడం సబబు కాదు. ఎందుకంటే కౌలు కివ్వాల్సిందీ, లేందీ తేల్చవలసింది ఆసామీ, అంతేగాని దున్నేవాడు కాదు. ఈ మాత్రం అతి సామాన్య విషయం భూమయ్యకి తెలీనందుకే అమీనా నవ్వుకున్నాడు.

అది తెలిక కాదు. చమటా, రక్తమూ ధారపోసి పెంచిన పిల్లాడిని, ఎప్పుడో కని పారేసిన తండ్రి వచ్చి లాక్కొని పోతే, పెంచిన తండ్రికి వచ్చేది కోపం కాదు. బాధ. ఆ కొడుకు మీద ఆశలు పెట్టుకొన్నప్పుడు కలిగేది బాధే కాదు - అందులోంచి విరుచుకుపడే కెరటంలాంటి ఆవేశం. అందుకే భూమయ్య అరుస్తున్నాడు.

దత్తత చేసుకొన్నట్లు రుజువు లేనప్పుడు ప్రయోజకుడైన వాడ్ని "నా వాడే" అని కాజేసుకుపోగల అధికారం కన్న తండ్రికి ఉంది. చేతి కర్రలాంటి కుర్రాణ్ణి పోగొట్టుకొన్న వాణ్ణి ఏ చట్టమూ ఆదరించదు. అందుకే అమీనా నవ్వు.

అదృష్టం కలిసి వస్తే, నడిచి వచ్చే కొడుకు పుడతాడన్నది సామెత. ఆ సామెత మీద నమ్మకం ఉన్న ఆసామికి అందుకే కోపం వచ్చింది భూమయ్య పిచ్చి అరుపులు విని,

"బాబూ చెప్పండి. మీ పొలాన్ని మీరు గుర్తుపట్టగలరా! ఎక్కడ నుంచి ఎక్కడకు ఉందో చెప్పండి. కళ్ళు మూసుకొని చెప్పగలను నేను ఏ రాయి ఎక్కడుందో." భూమయ్య పోగయిన జనాన్ని చూసి అన్నాడు.

నిజమే. ఆసామికి తన పొలం ఎక్కడ ఉందో తెలీదు. ఎంత ఉందో తెలుసు. కాగితాలు చూసి చెప్పగలడు ఎల్లలు.

ఆ కాగితాలు ఉన్నవాడే ఆసామి. లేని వాడు ఎన్ని అరచినా అర్థం లేదు.

అమీనా నవ్వు ఆగిపోయింది అతని డ్యూటీ గుర్తుకొచ్చింది. అందుకు తోడు ఆసామీ ఇస్తానన్న డబ్బు గుర్తుకొచ్చింది. వెంట పెట్టుకు వచ్చిన పోలీసు సిబ్బంది అతనికి ధైర్యం ఇచ్చింది.

భూమయ్యని ఈడ్చిపారేసారు.

మరు క్షణంలో చుట్టు ఉన్న జనం రాళ్ళతో ఆసామీని, అమీనాను ముంచేశారు. వత్తాసుగా వచ్చిన నలుగురు పోలీసులు దూరంగా పారిపొయ్యారు. వాళ్ళకి సంతోషంగానే ఉంది కళ్ళ ముందు జరిగిన న్యాయం.

భూమయ్యా స్వాధీనం అయింది భూమి.

ఆసామి జేబులోంచి టోపి తీశాడు, నెత్తిన పెట్టుకున్నాడు, చర చర నడు చుకొంటూ వెళ్ళి పోయ్యాడు అతనెవ్వ డెవరో అందరికీ అర్థం అయ్యింది. పోలీసులు దబ దబ వచ్చారు ముందుకి. ఆసామికి దండాలు పెట్టారు. భూమ య్యాని తప్పుకోమన్నారు.

భూమయ్యా ధైర్యంగా జనం వంక చూశాడు.

జనంలోంచి ఓ పెద్ద మనిషి ముందుకు వచ్చాడు. "భూమయ్యా తప్పుకో! ఆయన ఎవరో మనం గుర్తు పట్టలేదు. ఆయన మన యోగక్షేమాలు విచారించే నాయకుడు. మన కోసం సర్వం త్యాగం చేసి, పట్నంలో కిసాన్ యాత్రలు నడిపించి మన హక్కుల్ని రక్షించే పెద్ద మనిషి. ఆయనకి మనం చర్మంతో చెప్పులు కుట్టించినా తప్పు లేదు."

ఆ పెద్ద మనిషి మాటలు విన్న జనం మౌనంగా నిల్చున్నారు. అదను చూసి పోలీసులు అమాంతం భూమ య్యాని లాగి కేసు నమోదు చేశారు. ఆసామీ సలహా మీద, ఆ తర్వాత కేసు కాగితం చించేశారు.

జనం జై అంటుండగా ఆసామీ వెళ్ళి పోయాడు

భూమయ్యా మిగిలిపోయాడు.

ఎవరా జనం? ఆ జనం విప్లవ తరం గమా? కావచ్చు. కానీ ప్రస్తుతానికి ఎర మింగిన చేపలు! ఏమిటా ఎర? అది తెలీదూ మీకు?

## భవిష్యత్తులోకి...

కోడూరు ప్రభాకర రెడ్డి

నేడనే గవాక్షాన్ని తెరిచి వీక్షించాను
మండే ఎండల్లో మానవాళి
కండలన్నీ కరిగించే
దయనీయ దృశ్యాన్ని కాంచాను.
దేశాలను కలిపేస్తూ
హద్దులను చెరిపేస్తూ
వారిధులనూ, వాహినులనూ సంధించే
వారధులను దర్శించాను.

గుండెలలో తాపం సహించి
కుత్తుకలో కోపం వహించి
ఖాళీ కడుపులతో ఖైదీలు
వేసే రోడ్లను చూశాను.

తెల్లవారు, నల్ల వారు .... ఓహ్!
నానాజాతి సమితి అది
బహుభాషా సమ్మేళనం అది.

నేడనేది నిజమని నమ్ముతూ
రేపనే దాని కోసం
ఆశతో అర్రులు చాస్తూ
వారి మధ్యలో ఉన్నాను.

సోదరులారా అని
ఎలుగెత్తి పిలిచాను.
సోదరా! అని వేల గొంతుకలు
ప్రతిధ్వనించాయి.

భవిష్యత్తు బంగారు బాట
అవుతుందనే ఆత్మ విశ్వాసంతో
నిర్విరామంగా, నిర్వికారంగా
దుబాసీ లేకుండా తృప్తిదీరా
ముచ్చటించుకొన్నాం.

స్నేహితులారా!
నమ్మకమనేది లేకుండా
మనగలుగుతుందా మానవాళి?
మానవత్వమే జగతికి నివాళి!

# వంశాంకురం

(గత సంచిక మిగతా)

కె. చిరంజీవి

మిసెస్ జేమ్స్ : yes doctor, it is over

దేశికాచార్యులు : over! This is really a momentous day in our lives, డాక్టర్! ఈ రోజును నేనెన్నటికీ మరచిపోలేను. మరచిపోము డాక్టర్!

డాక్టర్ జేమ్స్ : Dont get excited Mr. Desikacharyulu. This is nothing but a sacred duty. ధర్మనిర్వహణ చేసారు మీరు. అంతే. అంత కంటే ఎక్కువ sentiments ను గానీ, attachments గానీ పెంచుకోవడం మంచిది కాదు.

దే: sorry docter: you are correct.

డాక్టర్ జేమ్స్ : చూడండమ్మ పావనీ! ఈ వారం పది రోజులుగా రోజూ temperature note చేస్తున్నట్టే, రేపు గూడా చేయండి. If you get pregnant, the temperature rises still further. ఇదే గుర్తు. యింకా ఖచ్చితంగా కనుక్కోవాలంటే urine test చేయొచ్చుననుకో. ఒక్క అర గంటలో తెలిసిపోతుంది. If you don't mind, రేపోసారొచ్చి టెస్ట్ చేయించ గూడదూ ?... Good; Now, we have come to the second stage of fertilisation First-Ovulation, second - fertilisation. and the third and last implantation. మొదటిదానితోనూ, చివరి దానితోనూ మనకేమీ పేచీ లేదు. మనకేస్‌లో ప్రధానమైనది fertilisation. ఆ fertilisation దీని తోనే జరిగి పోయిందా ఇక inseminate చేయవలసిన అవసరమే ఉండదు. కాకపోతే మాత్రం తప్పనిసరి. There is a good chance of conceiving within six months.

దే: ఆరు మాసాలా? రేపే వచ్చి 'నేను గర్భవతినయ్యాను డాక్టర్!' అని చెబుతుంది చూడండి మా యిల్లాలు. (మిడ్జ్ మ్యూజిక్)

పావని: అవును. నిజమే ... నేను గర్భవతినయ్యాను. sudden rise in temperature. సందేహం లేదు. నేను గర్భవతినే. నా శరీరమే నాకు చెబు తున్నది ... ఎంత చిత్రం! మళ్ళీ ఏడేళ్ల తరవాత. ఈ ఏడేళ్లలోనూ కుటుంబ నియంత్రణ పద్ధతులవ లంబించకపోతే ఎంతమంది పుట్టుండేవారు చెప్మా? పెళ్లయిన రెండో ఏట నానిగాడు పుట్టాడు. వాడు పుట్టిన రెండేళ్లకే మళ్ళీ బాబి గాడు. యిదే వరసలో ప్రతి రెండేళ్లకూ ఒక కాన్పనుకుంటే, ఎంతమందయ్యేవారు? మరి ముగురు పుట్టుండేవారన్నమాట. అంటే

మొత్తం ఐదుగురు. (నవ్వుకుంది) అయ్యబాబోయ్ ... ఐదుగురు బిడ్డల తల్లి నయ్యేదాన్నిప్పటికి ... యింతకీ నాకు పెళ్లయి ఎంత కాలమైంది? ఏడు, తొమ్మిది, పదకొండు. పదకొండేళ్లయింది ... అసలు, పదిహేనేళ్ల క్రితమే నాకు పెళ్ళి కావలసింది గదూ? ... అతనూ, అతను యిప్పుడెక్కడున్నాడో? (విరామ సంగీతం)

ధర్మారావు: ఇక్కడే ఉన్నానండి. పరవాలేదు, వారొచ్చేదాకా కూచుంటాను. (దూరంగా ఉన్న వారికెవరికో సమాధానం చెప్పినట్టు అంటాడు.) (గడియారం టిక్కుటిక్కుమనే ధ్వని)

పావని: గుడ్ మార్నింగ్ సిస్టర్. డాక్టర్‌గారున్నారా?

సిస్టర్: ఏ డాక్టర్?

పా: డాక్టర్ జేమ్స్.

సి: గవర్నమెంట్ హాస్పిటల్‌కెళ్ళారు. ఏదో complicated కేసొచ్చిందట.

పా: complicated!

సి: అవును. ఇద్దరు కవలపిల్లలు అంటుకుని పుట్టారట. ఆపరేట్ చేయవలసిన అవసరముంటుందేమోనని ఫోన్ చేస్తే, పరుగెత్తుకెళ్ళారు. వెళ్ళి చాలా సేపయింది. ఏక్షణాన్నయినా రావచ్చు. కూచోండి.

పా: థాంక్స్. మరి డాక్టర్ మిసెస్ జేమ్స్?

సి: ఇప్పుడే వార్డులో కెళ్ళారు. ఆవిడా వచ్చేస్తారు. అక్కడ కూచోండమ్మా; లోపల కూచోండి.

పా: అలాగే. (స్పాట్ మ్యూజిక్)

ధర్మారావు: ఎవరు?

పావని: మీరా

ధ: ఎలావున్నావు పావనీ?

పా: మీరెలా ఉన్నారు ధర్మరావు గారూ?

ధ: మళ్ళీ -

పా: పదిహేనేళ్ల తరవాత -

ధ: ఇదే చూసుకోవడం -

పా: ఇదే కలుసుకోవడం - (స్పాట్ మ్యూజిక్ ఎండ్స్)

ధ: పెళ్ళి చేసుకున్నావా? పిల్లలెంతమంది?

పా: మీకెంతమంది? ఇప్పటికి, రెండేళ్లకో బిడ్డ చొప్పున, కనీసం ఏడుగురినైనా కనివుండాలి. (ధర్మారావు నవ్వాడు) ఏం నవ్వుతున్నారు? అంతకంటే ఎక్కువా?

ధ: లేదు పావనీ. యిదే తొలి కాన్పు. మూడో మాసం గర్భం. (గడియారం గంట)

పా: మూడో మాసం గర్భమా?

ధ: అవును... నా ప్రశ్నకు నువ్వు సమాధానం చెప్పనేలేదు.

పా: నాకు ... నాకు ఇద్దరు మగ పిల్లలు.

ధ: (నవ్వుతూ) కవలలా? (ఫ్లాష్ బ్యాక్ బిగిన్స్)

పా: నన్ను కాదని తిరస్కరిస్తున్నారు గాని, మీరే నన్ను చేసుకుంటే, కాన్పు కొక్కణ్ణి కాదు, ఇద్దరు చొప్పున కవలల్ని కంటాను.

ధర్మారావు: నన్నర్థం చేసుకో పావనీ. తిరస్కరించడం కాదు. ధర్మానికి కట్టు బడుతున్నాను. మా వంశం –

పా: వంశం. వంశం. వంశమే ప్రధానమనుకున్నప్పుడు దాన్నే ప్రేమించక, నన్నెందుకు ప్రేమించారు? మనుషులకు ప్రేమమాటలెందుకు చెప్పారు? నన్నెందుకు నమ్మించి మోసగించారు?

ధ: నేను మోసం చేయలేదు పావనీ, ప్రమాణం చేస్తున్నాను. హృదయపూర్వకంగా నిన్ను ప్రేమిస్తున్నాను. కాని మా వంశంలో చివరివాణ్ణి నేనే. నిన్ను చేసుకుంటే –

పా: పిల్లలు కలగరని ఎక్కడ రాసుంది? మా తలిదండ్రులకు, నేనొక్కత్తెనే సంతానమైనంత మాత్రాన నాకుగూడ ఒక్క సంతానంకంటే ఎక్కువ కలగదనే సిద్ధాంతమేమిటి?

ధ: The line of fertility పావనీ! మీ తల్లి తరపు వారికెంత సంతానమో, తండ్రి తరపు వారికెంత సంతానమో, అన్నీ మా పెద్ద లెక్కలు తీయించారు గదా. poor fertility అని తేలింది. ఇద్దరు ముగ్గురుకంటే ఎక్కువ లేరు. ఉన్నది ఆడ సంతు.

పా: ఏం? ఆడ సంతు పనికిరాదా?

ధ: నీకర్థం కాదు పావనీ! వంశోద్ధరణకు మగవాడే కావాలి. వంశాన్ని నిలపవలసినివాడు మగవాడే.

పా: ధర్మారావుగారూ! యిదే, మీ అభిప్రాయం మీదే మీకు నమ్మకముంటే, మీరు నన్ను పెళ్ళిచేసుకోక్కరలేదు. ఇలాంటి అభిప్రాయాలున్న మగవాణ్ణి నేను పెళ్ళిచేసుకోక పోయాననే బెంగా బాధా, యిక నాకేమీ ఉండవు. వెళ్లండి. వెళ్లి, మీ ఇష్టమొచ్చిన చోట పెళ్లి చేసుకోండి. లెక్కలన్నీ తీయించి పుట్టుపూర్వోత్తరాలన్నీ గాలించి, high fertility వున్నచోటునే వెదికి చేసుకోండి. (ఫ్లాష్ బ్యాక్ ఎండ్స్)

పావని: ఆ, ఏమిటన్నారు?

ధర్మారావు: కవలపిల్లలా అని అడిగాను.

మిసెస్ జేమ్స్: హల్లో మిసెస్ పావని! మీరెప్పుడొచ్చారు?

పా: డాక్టర్ మిసెస్ జేమ్స్! ఒక్క ప్రశ్నకు మీరు సమాధానం చెప్పాలి.

మి: By all means

పా: Baby's sexని నిర్ణయించేదెవరు? ఏమిటి?

మి: The matter of baby's sex is pure chance, but it is husband Who is responsible for the sex of the baby and not the Wife

పా: విన్నారుగా ధర్మారావు గారూ.

మి : స్త్రీ 'X' అనే chromosomes ను మాత్రమే produce చేస్తుంది. పురుషుడు 'X Y' అనే chromosomes రెండింటినీ produce చేస్తాడు. స్త్రీ పురుషుల యొక్క 'XX' కలిసిందా ఆడపిల్ల 'XY' కలిసిందా మగపిల్లవాడు. కాబట్టి baby's sex ని నిర్ణయించేది మగవాడే. అంటే Y అనే chromosome ఒక్క మగవాడి దగ్గిరే ఉంటుంది. ఆడదాని దగ్గర కాదు . . . అందువల్ల . . . ఐనా మీరు ఒకరితో ఒకరు మాట్లాడుకుంటున్నారు . . . బాగా పరిచయమా?

ధ : ఇరవయ్యేళ్ల పరిచయం.

మి : My good heavens professional ethicsతో మేము కాపాడుకుంటూ వచ్చిన రహస్యాన్ని –

ధ : రహస్యమా ?

పా : డాక్టర్ మిసెస్ జేమ్స్! నేను మళ్లీ కలుస్తాను, మళ్లీ వస్తాను.

మి : మిసెస్ పావనీ! పావనీ! (విరామ సంగీతం)

పావనీ: మీరా ఎందుకొచ్చారు? మా అడ్రసు ఎవరిచ్చారు?

ధర్మారావు : ముందు తలుపు తీయి పావనీ.

పా : తియ్యను. ఈ యింటి లోపలికొచ్చే అర్హత మీకు లేదు.

ధ : నిజమే. నీకు చాలా అన్యాయం చేసాను పావనీ అంగీకరిస్తున్నాను.

పా : నేనేమీ అన్యాయం కాలేదు. దయచేసి 'మీరు' అని నన్ను సంబోధించండి. మీకూ నాకూ ఏమిటి సంబంధం? చాలా . . . చాలా చాలా దూరం.

ధ : ఆ దూరం చేసుకుంది నేనే. (ఏడుపు వచ్చేలా ఉంది.) నిన్ను దూరంగా నెట్టి వేసింది నేనే పావనీ! అందుకే క్షమించమని నిన్ను వేడుకోవడానికొచ్చాను.

పా : హుం, ఎందుకు క్షమాపణ ?

ధ : నేను నీకన్యాయం చేశాను గనక. ఎవరికైతే చేయగూడని అన్యాయం చేశానో, వారే నాకిప్పుడు ఆసరా అయ్యారు గనక నేనెంతో సిగ్గుపడు తున్నాను పావనీ! నువ్వే మా వంశాంకురాన్ని –

పా : కాదు, విషబీజాన్ని –

ధ : పావనీ!

పా : పావని గారూ అని పిలవమన్నాను. (క్షణం నిశ్శబ్దం) ఈ విషబీజం మీదేనని తెలిస్తే నా కడుపులో మోసివుండేదాన్ని కాను. ఇప్పటికే నా కడుపులో ఏదో రోత పుడుతున్నట్టు feel అవుతున్నాను. వెళ్లండి.

ధ : ఇది రెండోసారి. ఇది రెండోసారి పావని గారూ, మీతో వెళ్లగొట్టించు కోబడటం.

పా : అవును ధర్మారావుగారూ ఇది రెండోసారే నేను అన్యాయం చేయబడటం. మోసగించబడటమూను. వెళ్ళిపొండి, ప్లీజ్ !

(పావని ఏడుస్తుంటుంది –దానిమీద కాల్ బెల్)

దేశికాచార్యులు : ఎవరోయ్, బాగా తప్పతా గినట్టుతూలుతూ, మెట్లు దిగిపో తున్నాడు ?

పావని : (బలవంతంగా ఏడ్పునాపుకుంటూ) అతనా ? అతను-

దే: అతను -

పా: మన పాలిట శత్రువు. మన పాలిట దయ్యం, భూతం, ప్రేతం, పిశాచం. ఏమండీ (అంటూ పెద్ద పెట్టున ఏడుస్తూ) నన్ను క్షమిస్తారా?

దే: పావనీ? పావనీ! ఏమిటీ పని? ముందు కాళ్లమీదినుంచి లే.

పా: దేవుడి దగ్గరే నేను మనస్సు విప్పలేకపోయాను. ధర్మప్రభువు ఎదుటనే ఒక రహస్యం దాచాను. సర్వం మీకర్పించానని చెప్పినా, నా మనస్సు మారుమూలల్లోని చీకటిని మీకు చూపెట్టలేకపోయాను.

దే: అది అందరికి సాధ్యంకాదు పావనీ! ఒక్కడికే సాధ్యం, కవికి. అందులోనూ మామూలు కవికి గాదు. వేదాంతియైన కవికి మాత్రమే సాధ్యం. కళ్లు తుడుచుకో. పిల్లలెక్కడికెళ్లారు?

పా: కింద ఆడుతున్నట్టున్నారు. (విరామ సంగీతం)

డాక్టర్ జేమ్స్: This is not a child's game, Dr· Mrs. James చిన్న పిల్లల ఆట కాదది. రెండు కుటుంబాలకు సంబంధించిన జీవన్మరణ సమస్య.

మిసెస్ జేమ్స్: I never expected like that doctor

డా: ఇప్పుడు చూడు. ఆ అమ్మాయి, ఇక అగ్రిమెంటుని ఖాతరు చేసేదే లేదు పొమ్మంటున్నది. అవును, Breach of an agreement. అత్యంత గోప్యంగా ఈ రహస్యాన్ని దాచిపుంచుతామని అగ్రిమెంటులో ఒక పాయింటు. దాన్ని నీ తెలివి తక్కువ వల్ల break చేశావు. దీనికి పర్యవసానమేమిటి?

మి: I will go and see that she gets convinced.

డా: పాపం, ఆ పిచ్చి మహారాజు, ఆ అమ్మాయిని కన్విన్స్ చేయడానికి ఎంతగానో ప్రయత్నిస్తున్నాడు. గుడ్ స్పిరిట్స్‌లో పెట్టడానికి ఎన్నో అవస్థలు పడుతున్నాడు. కాని మొగుడి మాట వింటేనా? . . . కడుపు తీసేయించుకోవడానికి గూడా సిద్ధపడుతున్నదట! (గడియారం గంట)

దేశికాచార్యులు: May I come in Doctor?

డాక్టర్ జేమ్స్: ఎవరు? దేశికాచార్యులుగారా! అరెరే మా అమ్మాయి గూడా వచ్చిందే. నువ్వెందుకొచ్చావమ్మా పావనీ! రావద్దని చెప్పనుగా? నువ్వు రానక్కరలేదు, నేనే యింటికొచ్చి చెకప్ చేస్తానన్నానుగా?

దే: అన్నారు సరేగాని, మీరు నాకు మామెప్పుడయ్యారు మామయ్య డాక్టర్ గారూ? (పావని తప్ప మిగతా ముగ్గురు నవ్వారు.)

డా: మామయ్య డాక్టరు కాదయ్యా అల్లుడూ! డాక్టరు మామయ్యా అనాలి. నీకంటే నేనే బాగా రాసేటట్టున్నానే తప్పులేకుండా.

దే: వచనమైతే (మళ్ళీ అంతా నవ్వారు.)

డా: మమతలూ మమకారాలూ అనేవి చెప్పిరావయ్యా అల్లుడూ. sponteneousగా-

దే: కవిత్వంలా కలుగుతాయంటారు.

డా: కరెక్ట్ రమ్మంటే వచ్చేదీ కాదు. పొమ్మంటే పోయేదీ కాదు. హృదయానికి సంబంధించినది. ఏమ్మా పావనీ ఏమంటావు? మాట్లాడవేం? నా మీద కోపంమింకా తగ్గలేదా?

దే : ఆ కోపం మీ మీద కాదు డాక్టర్

డా : ఊఁ, మామయ్యా! (కోపగించుకుంటాడు)

దే : మీమీద కాదు డాక్టరు మామయ్యా. నా మీద.

మ : దేనికి ?

దే : నేనే ఒప్పించానట ఈ పనికి. నేను చెప్పి సమర్థించి, ఒప్పించానట.

డా : నువ్వు చెప్పి ఒప్పించేదేమిటయ్యా అల్లుడూ! ఆ మాత్రం తెలివితేటలు మా అమ్మాయికి లేవనుకున్నావా ?

పా : లేవనుకొనే, మీరివన్నీ మాట్లాడుతున్నారు. నేనేమీ చిన్నపిల్లను కాను, బుజ్జగించడానికి. యిద్దరు బిడ్డల తల్లిని. మూడోబిడ్డకు తల్లిని కావడానికి సిద్ధంగా ఉన్నదాన్ని. క్షమించాలి. మూడో బిడ్డను కనడానికి మాత్రమే యంత్రంగా వున్నదాన్ని. తల్లిని కాను. కేవలం కడుపును చేసుకోండి పరీక్షలు. (విరామ సంగీతం)

ధర్మారావు : ఈ పరీక్షలోనయినా నన్ను కృతార్థుణ్ణి చేయి భగవాన్! నీకు నమస్కరిస్తున్నాను, ఒక నలుసు వేలెడంత నలుసు నివ్వు చాలు, మా వంశం నిలబడటానికి. యింకేమీ కోరను నిన్ను . . . నా సుందరి – ఎన్నో నోములు నోచి, ఎన్నో వ్రతాలు కాచి, ఎనెన్నో పూజలు చేసి గర్భవతయింది. ఈనాటికి తన కడుపు పండింది భగవాన్! ప్రసవించబోతోంది.

(అప్పుడే పుట్టిన శిశువు ఏడుపు)

(పట్టరాని సంతోషంతో) నాన్నా నాన్నా సుందరి ప్రసవించింది. మనకు మగబిడ్డను ప్రసాదించింది నాన్నా అదుగో, ఆ ఏడ్పు వినిపించడం లేదా? ఇపుడే ఉదయించిన శిశువు ఏడ్పు! నర్స్! తల్లిబిడ్డా కులాసాగానే ఉన్నారు గదా ? ఇద్దరూ క్షేమమేగదా ? ఓహ్ యింత మంచి వార్త చెప్పినందుకు మా చీకటి జీవితంలో వెన్నెలలు కురిపించినందుకు – నీకేమివ్వమంటావు చెప్పు ? ఈ శుభసమయాన, ఇదుగో, ఈ బంగారు గొలుసు నీకు కానుక ఇస్తున్నాను. తీసుకో సిస్టర్ తీసుకో . . . నాన్నా గొడ్రాలు గొడ్రాలని యింతకాలంగా మీరంతా నా సుందరిని ఆడిపోసుకున్నారు. వేధించుకు తిన్నారు. ఈవిడకు మాత్రం మనం పరీక్షలు పెట్టకుండనే పెళ్లిచేసుకున్నామా ? మరేమి మాట్లాడకండి పైకి మాట్టాడనంత మాత్రన మీ మనస్సులలోని మాటలు నేను చదవలేననుకున్నారా ? నాకన్నీ తెలుసు. సుందరీ! బిడ్డనలా పొత్తిళ్లలో దాచుకుంటావేం ? చూపెట్టు. ఈ చుట్టపక్కాలందరికీ చూపెట్టు మనకు వంశోద్ధారకుడు కలిగాడనీ, ఇక ఈ వంశం నిర్వంశమై పోకుండా నిలిచిపోతుందనీ చెప్పు. మాట్లాడదేం ? సుందరీ ! సుందరీ !

సుందరి : ఏమండీ ! ఏమిటి కలవరిస్తున్నారు ? మిమ్మల్నే నిద్రలేవండి.

ధ : చెప్పు సుందరీ ! నువ్వు గొడ్రాలివి కావనీ, మనకు సంతానం కలిగిందనీ, వీళ్లందరికీ చెప్పు.

సు : ఏమండీ ! మేల్కొన్న తరవాత గూడా ఈ మాటలేమిటి ? ఏదయినా కలొచ్చిందా ?

ధ : కలా ! ఇందతా కలేనా ?

సు : (ఊస్సురని నిట్టూర్చి) యిందతా నా దౌర్భాగ్యం. మిమ్మల్ని కలల్లోనే బ్రతకమని శపించిన పాపిష్టిదాన్ని. (ఏడుస్తుంటుంది)

ధ : సుందరీ ! సుందరీ ! ఊర్కో సుందరీ ! ఇందులో నీ తప్పేముంది?

సు : తప్పు నాదే. నా పుట్టుక తప్పు.

ధ : ఊర్కోమంటుంటే ....

సు : నిస్సహాయురాల్నండి. నన్నేం చేయమంటారు ? నేను చేయగలిగిందే ముంది చెప్పండి ?

ధ : నువ్వేమీ చేయనక్కరలేదు. ఊర్కో సుందరీ ! మన కలలు పండే రోజు లొచ్చాయి, వస్తున్నాయి సుందరీ ! (విరామ సంగీతం)

పావని : ఏమండీ ! మిమ్మల్నే !

దేశికాచర్యులు : ఏమిటోయ్, మరి ఇంత ఆప్యాయంగా ఆదరంగా పిలుస్తున్నా వివ్వాళ ?

పా : నాకు నొప్పులొచ్చేలా ఉన్నాయండీ.

దే : నొప్పులా ?

పా : వారందాకా కాన్పు కాదన్నారు గానీ, నాకేమిటో అనుమానంగా ఉంది.

దే : టాక్సీ పిలవనా ?

పా : పిలవండి .... ఏమోయ్ ! ఒక్క మాట.

దే : ఏమిటి ?

పా : చిన్న కోరిక. చెల్లిస్తావా ?

దే : ఏమిటో చెప్పు.

పా : టాక్సీలో కాకుండా, నన్ను నీ చేతుల మీదుగా మోసుకెడితే సంతోషిస్తా నోయ్.

దే : నెత్తిన పెట్టుకు మోసుకెడతా గాని, మాట్లాడకుండా కూచో, ఇప్పుడే వస్తాను.

పా : యింకొక్క మాట.

దే : మళ్లీ ఏమిటి ?

పా : పిల్లలెక్కడ ?

దే : ఎందుకు ?

పా : ఒక్కసారి వాళ్లను చూసుకుంటానోయ్.

దే : నీకేమైనా పిచ్చెక్కిందా ?

పా : ప్లీజ్ నా మంచి మగవాడివిగా. ఒక్కసారి పిలువు.

దే : ఒరే నానీ ! బాబీ ! నేనిప్పుడే వచ్చేస్తాను గానీ, అందాకా మీరు అమ్మ దగ్గర కూచోండి.

పా : నానీ వచ్చావా నాయనా. బాబీ ! యింకా దగ్గరకు రా. తండ్రి ... మీ నాన్న దేవుడురా ! దేవుడు. (దుఃఖం పెల్లుబికి పోతుంది) దేవుణ్ణి పిల్లల చేతుల్లో పెట్టి పోతున్నాను. మిమ్మల్ని ఆయన చూసుకోలేడు, మీరే ఆయన్ని చూసుకోవాలి. జాగ్రత్తగా కొలుచుకోండి నాన్న దేవుణ్ణి ...

దే: యింకా ముచ్చట్లేమిటోయ్! పద, టాక్సీ వచ్చింది.
పా: నానీ! నేను చెప్పిన మాట ... బాబీ! గుర్తున్నది గదూ?
దే: ఉన్నదిలే బయలు దేరవోయ్ ముందు. (టాక్సీ బయలుదేరింది)
పా: ఏమోయ్
దే: ఏమిటోయ్
దే: ఆడదానికి కాన్పంటే మరో జన్మ.
దే: ఇద్దరిని కన్నదానివి, నీకు భయమేమిటోయ్
పా: మరో జన్మ ఉన్నదో లేదో చెప్పలేం.
దే: యింకా మనకు జన్మలెందుకోయ్ వెయ్యిజన్మాల సుఖాన్ని ప్రతిక్షణంలోనూ ఆ క్షణంలోని ప్రత్యణువులోనూ అనుభవించాం.
పా: తేలు ప్రసవించిందంటే -
దే: ప్రసవించిందంటే?
పా: పిల్లలు బయటికి రావడం, తల్లి మరణించడం.
దే: పావనీ! తప్పు, తప్పు అలాంటి మాటలనగూడదు. (తనూ చలించిపోతాడు) (టాక్సీ చప్పుడు చేసుకుంటూ ఆగింది) దిగు, నెమ్మది నెమ్మది.
(విరామ సంగీతం)
డా: తొందరేమీలేదు. కంగారు పడకండి. నేనే స్వయంగా అటెండ్ అవుతున్నాను. (ఫోన్ డయల్ చేశాడు.)
డా: Is it Mr. Dharma Rao please ... అవును, వెంటనే బయలుదేరి రండి. ఉన్న పళాన. (ఫోన్ పెట్టేశాడు)
దే: అతనెందుకు?
డా: రానివ్వండి. ఎలాగూ తెలిసిపోయిందిగా?
దే: మీ యిష్టం. Its all left to you.
డా: This is an end to the dramatic beginning. The dramatic beginning of human life is as exiting as the biblical story of creation. సృష్టి చిత్రాన్ని ఆవిష్కరించబోతున్నామిప్పుడు ...
సిస్టర్: (కంగారుగా పరుగెత్తుకుంటూ వచ్చి) డాక్టర్!
డా: యస్ సిస్టర్ (అంటూ మాటలు ఆపి లోపలికి వెళ్లిపోతాడు)
(గడియారం టిక్కుటిక్కుమంటుంది. దూరంగా కారొచ్చి ఆగిన చప్పుడు. ఇంకా సమ్మెట పోటుల్లా గడియారం టిక్కుమంటూనే వుంది నిరవధికంగా)
దే: భయంకరమైన ఈ మృత్యుపదఘట్టనకు అంతేమీ లేదా ధర్మారావు గారూ
ధ: ఉంది, ఉంటుంది. (అంటుండగానే దూరాన మరో కారొచ్చి ఆగిన చప్పుడు.) పుట్టిన ప్రతిదానికి మృత్యువుంటుంది.
దే: మృత్యువుకు కూడానా?
ధ: ఆ అదికూడా జీవమున్నదైతే ... అరుగో డాక్టర్ మిసెస్ జేమ్స్.
మి: పావని ప్రసవించింది. (గడియారం గంట) ఇద్దరాడ శిశువుల్ని.
దే: పావని ...

మి: Pavani is no more ఇక పావని లేదు. The fit was such tha}
erupted like a volcano throwing up twin girls. ఫిట్టులో ఇద్దరాడ పిల్లలు కవలల్ని కని మరణించింది. we are terribly sorry డాక్టర్ గారు బయటకు రాలేనంటున్నారు.

కొండలరావు: అసలీ వృత్తినుంచే విరమించుకోమని చెప్పండి. చెంపలూ జుల పాలూ పెంచుకొని, డాక్టర్ జేమ్స్, M. D. D. G. O. లని పెద్ద తాటి కాయంత అక్షరాలతో బోర్డు రాయించి పెట్టుకుంటే సరిపోదు. నా బిడ్డలో లోపమున్నదట, సంతానమే కలగదని ఈ కుక్కబొచ్చు డాక్టర్ సర్టిఫికె టిచ్చాడట! ఇప్పుడు చెప్పండి, ఇప్పుడేమటంటారు?

మి: ఎవరీయన?

కొ: ఎవరినా? ఈ ధర్మారావుగారి మామని. సుందరమ్మగారి తండ్రిని. కొండలరావుగారిని. ఇప్పుడు చెప్పండి. నా కూతురు నెలతప్పింది. గర్భ వతయిందని –

మి: No, it is impossible.

కొ: అదే వద్దన్నాను, ఆ ఇంగ్లిషు కూతలే కుయ్యొద్దన్నాను.

మి: సుందరమ్మగారు గర్భవతి కావడానికి అవకాశం లేదు. ఆవిడ గర్భకోశం–

కొ: మీరొక్కరే డాక్టర్లా అమె డాక్టరు కాదా? అయమ్మ ఆ చల్లనితల్లి అన్ని పరీక్షలూ చేసి, ఇది శిలాక్షరమని చెప్పింది... ఏమండీ అల్లుడు గారూ కాంట్రాక్టు ప్రకారం, మనకు మగబిడ్డను కని యిస్తేనే, యాభై వేల రూపా యలూ మనం యివ్వతేలతాం. అంతేనా?

మి; అదేమీ కాదు. అలాంటిదేమీ లేదు. అగ్రిమెంటులో ఆడా మగా అన్న ప్రస్తావన లేదు. బిడ్డను కనియివ్వడానికి మాత్రమేనని ఉంది.

కొ: బిడ్డను కని యివ్వడమంటే ఏమిటమ్మ వంశోద్ధారకుణ్ని కని యివ్వడం 'వంశోద్ధారిణి' అని ఏ ధర్మశాస్త్రంలోనూ చెప్పలేదు. లాపాయింటంగీరించదు

దే: అమ్మా! (క్షణం నిశబ్దం) మేము, డబ్బుకోసం కాదు దీనికంగికరించింది. మీకు తెలుసు. ధర్మంకోసం.

కొం: డబ్బక్కరలేకపోతే, ఇంకా ఆడసజ్జు మాత్రం మనకు దేనికి? వాడిఎదానే పడెయ్యండి. ఇంకెందుకండీ అనుమానం అల్లుడు గారూ! మీ భార్య పండంటి మగబిడ్డను కని మీకందిస్తుంది.

రామయ్య: అయ్యా

ధ; నువ్వా రామయ్య.

రామ: అవునుబాబు. కొండలరావుబాబు గారితో కలిసొచ్చినా. (క్షణం నిశబ్దం) నేను సదువుకొన్నోణ్ణి కాదు. తోటమాలిని. మీ మొసేతుల కింద నీళ్లు తాగి బతికేవోణ్ని. నేను మీకేం సెప్పగల్నుగాని ... బాబుగోరూ! అసలీ భూమిలో మొక్క మొలవదన్నారా? పనసంటు పైకి రాదన్నారా?
పాటు జేసినా, ఏసినా అందులో బీజం గూడా లేంది. అంటుమొక్క ఇయ్యాలే తొలి పండు బయటికొచ్చినాది బాబు! ఈడ – మన బంగ్లాలోనేమో – గింజె

మొలవని నేలన పనస పండిచ్చినా, అడ నా గుడిసెకాణేమో మారు మనువు కూతుర్ని సొంత కూతురుకంటే ఎక్కువగా సాకి, మీ దయవల్ల, పెళ్లిచేసినా .. ఇయ్యాల అంపకాలు బాబూ! దాన్నో అయ్య సేతులో పెట్టి, దానింటికి దాన్ని పంపిస్తే, నా పని పూర్తయిపోనట్టే! నా జల్మ కడతేరినట్టే బాబు! నాకింకా ఏ దిగులూ నేదు. పోయొస్తా. సెలవిప్పియ్యండి బాబు! (సంతోషాశ్రువులతో కంఠం రుద్ధమైంది)

దే: తోటమాలి రామయ్యకు చేతులెత్తి నమస్కరిస్తున్నాడీ కవి. (ఇతని కంఠ రుద్ధమైంది) విన్నారా అతని మాటలు? మన అందరి వంశాలకంటే ఇతని వంశం గొప్పది. కడుపున పుట్టిన బిడ్డల్నే ప్రేమిస్తున్నాంమనం, ప్రేమించగలు గుతున్నాం మనం. అదయినా అంతంత మాత్రంగా. కాని ఈ తోటమాలి రామయ్య చెట్టునీ పుట్టనీ, యెవరికో పుట్టిన మారుమనవు కూతుర్ని, సువిశాల హృదయంతో పరిపూర్ణంగా ప్రేమిస్తున్నాడు. ప్రేమకు స్థానం కడుపు గాదు బాబూ! ఉదరకోశం కాదు. హృదయం ప్రేమించేది హృదయం గాని కడుపు కాదు. కడుపు చించుకుంటేనే ప్రేమ కలుగుతుందన్నది భ్రమ ... కడుపున పుట్టిన బిడ్డలు ఎంతమంది తమ తలిదండ్రుల్ని హత్య చేయలేదు? అలాగే, ఎందరు తల్లిదండ్రులు తమ బిడ్డల్ని చిత్రవధ చేయు లేదు? .... క్షేత్రము, బీజము - రెండూ ప్రధానమైనవేగానీ - అత్యంత ప్రధానమైనది స్థితి, వాతావరణం, పరిసరాలు, పరిస్థితుల ప్రాబల్యంవల్లనే మనిషి పెరుగుతాడు ... ఈ తోటమాలి రామయ్య తండ్రిని చూసయినా మనం నేర్చుకుందాం, పెరుగుదాం. గొప్ప గొప్ప వంశాలను. నూతనమైన, రంగు రంగుల అందమైన వంగడాలను సృష్టిద్దాం.

పేపర్ బాయ్: పదండి సర్ బిడ్డల్ని ఇప్పుడివ్వరట!

దే: నువ్వా తమ్ముడూ! నా పావని చావు చూడ్డానికి నువ్వూ వచ్చావా? .. మనుషుల్ని మట్టిచేయడమెలాగో నాకు చేతకాదయ్యా. (ఏడుస్తాడు)

పే: ఊరోకండి.

దే: ఛీఛీ నేనేడవకూడదు. ఏడవను, పద. పద తమ్ముడూ! నువ్వు కుంతి కొడుకువి కదూ? పరమ పతివ్రతమైన కుంతిదేవి ప్రథమ సంతానానివిగదూ? వంశోద్ధారకుడివి! హు ... కర్ణుడికి తన తల్లెవరొ తెలియనయినా తెలిసింది. ఆ భారతంలో. కాని ఈ భారతంలో నీకు తల్లెవరో తండ్రెవరో తెలియ దన్నావు గదూ? పద, నా పావనిని మట్టిచేసే ఆ శ్మశాన భూమిలోనే నీ కథకు నాందీ వాచకం పలుకుతాను. నాల్కలు సాచే నా పరమ పావని చితి మంటల నుంచే నీ కథ లేస్తుంది. పూస్తుంది. భారతాన్ని తిరగ రాద్దాం తమ్ముడూ!

పే: రేపటి పత్రిక ఇప్పుడే వచ్చింది. ఈ సాయంత్రమే వచ్చింది సర్. మీకోసం తెచ్చాను. ఇందులో ఒక మంచి న్యూస్ ఐటం ఉంది. చదవమంటారా?

దే: చదువు.

పే : A glowing picture was painted of a world where the air is pure, the water clean and the sun always shines. An intensive study of such a space colony by 28 scholars, scientists and (స్పాట్ మ్యూజిక్)

దే : ఎక్కడ స్వచ్ఛందమయిన గాలి స్వేచ్ఛగా వీస్తుందో ఎక్కడ పవిత్ర జలాలు పరవళ్లు తొక్కుతూ ప్రవహిస్తాయో ఎక్కడ సూర్యుడు కళకళలాడుతూ సర్వవేళలా తళతళలు పోతాడో- తల్లీ నా దేశాన్ని అక్కడికే నడిపించు నా దేశ ప్రజలందరినీ దిద్ది గోరుముద్దలు తినిపించు!

(స్పాట్ మ్యూజిక్ ఎండ్స్)

తమ్ముడూ నా మనస్సు ఇప్పుడు బాగా పదునై, మెత్తనై, సుక్షేత్రమై నాగళ్లను కోరుతున్నదయ్యా పద. ఈ రోజే, వెన్న కంటే వెన్నెలకంటే మెత్తనయిన ఈ పుడమితల్లిని - భూమాతను - దున్ని బీజసంధానం చేద్దాం. అంకురార్పణ చేద్దాం పద!

(సమాప్తం. ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం సౌజన్యంతో)

# మద్రాసు తెలుగు మాండలికం

## చర్చావేదిక

ఆంధ్ర ప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం మద్రాసు శాఖ మార్చి 4 న పొట్టి శ్రీరాములు స్మారక మందిరంలో జరిపిన సమావేశంలో శ్రీ కోరాడ రామకృష్ణ 'మాండలిక భాషల నిర్మాణము, మద్రాసు తెలుగు స్థానము' గురించి టేప్ రికార్డు చేసిన సంభాషణల సహాయంతో తమ వ్యాసం చదివేరు. భౌగోళిక స్థానం, సామాజిక సంబంధాలు, ఇరుగు పొరుగు భాషల సంబంధాల మధ్య భాషల పెరుగుదల, వాటి వైవిధ్య విస్తరణ, పరస్పరావగాహన పరిధిలో స్వరభేదాలు, అర్థవిశేషాలు, నూతన పదాలతో మాండలికాలు ఏలా విస్తరిస్తున్నాయో వివరించేరు. వృత్తి భేదాలు ఫలితంగా వివిధ వర్గాల వారి పలుకుబడులలో వచ్చిన ప్రత్యేకతలను, ఇతరేతర భాషల సంపర్కంతో తెలుగు దేశపు సరిహద్దులలో వచ్చిన పలుకుబడుల ప్రత్యేకతలను రికార్డు చేసిన టేపు సహాయంతో వివరించేరు.

రవాణా సౌకర్యాలు విస్తరించడం వలన, ప్రధాన పత్రికలు విస్తరించుతున్న ఫలితంగానూ మాండలికాల భేదాలు తగ్గి వ్యావహారిక భాషగా ఒక నూతన రూపం ఏర్పడుతున్నదన్నారు. ప్రసంగం గురించి జరిగిన చర్చలో ఇంచుమించు సభ్యులందరూ పాల్గొన్నారు.

# వార్తా సంగ్రహం

## గణితశాస్త్రరీత్యా భారతీయ సంగీత విశ్లేషణ

సంగీత నాటక అకాడమీ, మద్రాసు విశ్వవిద్యాలయం ఏర్పాటుచేసిన సదస్సులో ప్రసంగిస్తూ మాల్కొం ఆదిశేషయ్య, గణిత శాస్త్ర రీత్యా భారతీయ సంగీతాన్ని విశ్లేషణ చేసినట్టయితే, అది పరదేశాల వారికి కూడా అవగాహనలోకి వస్తుందని చెప్పారు. భారతీయ సంగీతంపట్ల పశ్చిమ దేశాలలో ఎంతో ఆసక్తి వుందనీ, రెండు సంగీత పద్ధతులు తెలిసిన వారు దానిని తెలియచెప్పడం అవసరమని సి. వి. నరసింహన్ అన్నారు.

## భయోత్పాతాన్ని కలిగించే ఫిల్ములు

భయోత్పాతం కలిగించే ఫిల్ముల ప్రదర్శనం గురించి లోక్‌సభలో సభ్యులు ఆందోళనను వ్యక్తంచేసి, వాటిని నిషేధించాలని కోరారు. 'ఎక్సోర్‌సిస్ట్' అన్న విదేశ చిత్రానికి, 'జాదూ తోనా' అన్న హిందీ చిత్రానికి సర్టిఫికేట్ రద్దు చేయమని సెన్సార్‌బోర్డు కోరిందని సమాచార, రేడియోశాఖ మంత్రి అద్వానీ తెలిపారు. నియమాలు ఎలావున్నప్పటికీ భయోత్పాతంతోనూ, సెక్సుతోనూ నిండిన ఫిల్ములు టెలివిజన్‌లోనూ ప్రదర్శింప బడుతున్నాయని పి. జి. మవలంకర్, రహస్యంగా 'బ్లూఫిల్ముల' చూపబడుతున్నాయని పి. వెంకటసుబ్బయ్య చెప్పారు.

## ప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షత

ప్రదేశ సాహిత్య అకాడమీకి అధ్యక్షుడు ఎప్పుడూ ఒకరేనా అని విమర్శిస్తున్నారని, దాని అధ్యక్షులు గోపాలరెడ్డి గారు, దానిలోని 70 మంది సభ్యులలో ఏఒక్కరు పోటీకి నిలబడినా తాను విరమిద్దామనుకుంటే, 70 మంది మళ్లీ తననే ఎన్నిక చేశారని విశాఖపట్నంలో ఒక సభలో వెల్లడిచేశారు.

## వ్యావహారిక భాష, విశ్వవిద్యాలయాలు

వ్యావహారిక భాషను ప్రభుత్వం, విశ్వవిద్యాలయాలు అంగీకరించాయి; అయితే దానిని విశ్వవిద్యాలయాల్లో ఎందుకు ప్రవేశపెట్టడం లేదు అని విశాఖపట్టణంలో జరిగిన ఒక సభలో శ్రీ పురిపండా అప్పలస్వామి ప్రశ్నించారు. "గ్రాంధిక భాష తాజ్‌మహల్ వంటిది. చూడడానికి మహా అందంగా వుంటుంది. కాని నివాసానికి దాన్ని మనం వాడం" అని వివరించారు.

అనేక ఉద్యమాలు సాగిస్తోన్న విద్యార్థులు వ్యావహారిక భాషకోసం ఉద్యమం ఎందుకు సాగించరని శ్రీ బెజవాడ గోపాలరెడ్డి అడిగారు. శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, ఆంధ్ర విశ్వవిద్యాలయం హిందీ విభాగం పూర్వపు అధిపతి శ్రీ సుందర రెడ్డి మొదలైనవారు కూడా ప్రసంగించారు

## జానపద కళల పునరుద్ధరణ

నానాటికీ నశించిపోతోన్న వివిధ జానపద కళల పునరుద్ధరణకు ప్రభుత్వంకంటె స్వచ్ఛంద సంస్థలే ఎక్కువగా కృషి చేయవలసి వుంటుందని కడప జిల్లా రచయితల సంఘ కార్యదర్శి శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి, కడపలో జరిగిన శ్రీ వీరబ్రహ్మేంద్ర గ్రామీణ సంస్కృతి వికాస పరిషత్తు వార్షికోత్సవంలో విజ్ఞప్తి చేశారు.

## సాంస్కృతిక రంగంలో మతతత్త్వ శక్తులు

సాంస్కృతిక రంగంలో మతతత్త్వ, ఛాందస భావాల ప్రతిఘటనకు విస్తృత ప్రాతిపదికతో ఐక్యత అవసరమని కొత్త ఢిల్లీలో అభ్యుదయ రచయితల జాతీయ సమాఖ్య అధ్వర్యాన జరిగిన సభలో వక్తలు నొక్కి వక్కాణించారు. 45 ఏళ్ళ క్రితం అభ్యుదయ రచయితల సంఘ స్థాపకులలో ఒకరైన హిరేన్ ముఖర్జి జాతి జీవనంలో వర్థమాన రచయితలు, కళాకారులు చొచ్చుకపోలేక పోతున్నందుకు తీవ్ర ఆందోళన వ్యక్తపరిచారు.

## చరిత్ర రచన, ప్రాంతీయతత్త్వం

కొత్త ఢిల్లీలో చరిత్రకు సంబంధించిన ఒక సదస్సుకు సమర్పించిన తన పత్రంలో మైసూరు విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ ఎ. నరసింహ్లు

మూర్తి దక్షిణ భారత దేశ చరిత్రకారులు చరిత్రరచనను పాక్షిక బుద్ధితో సాగిస్తున్నారనీ, వీరు యిప్పటి రాష్ట్రాల సరిహద్దులను బట్టి పూర్వపు రాజవంశాలు ఏ రాష్ట్రాలకు చెందినవో నిర్ణయించడం తప్పనీ చెప్పారు.

## అంధ ఆంధ్ర విద్యార్థికి సంగీతంలో డాక్టరేట్

బొబ్బిలిలో జన్మించిన గరిమెళ్ల మోహన రావు అన్న 36 సం. రాల వయస్సుగల అంధ సంగీత విద్యార్థికి ఢిల్లీ విశ్వవిద్యాలయం తొలి సారిగా డాక్టర్ పట్టం యిచ్చింది. "ప్రత్యేకించి కర్ణాట సంగీత ప్రస్తావనతో భారతీయ సంగీతంలో పరిభాష, స్వరకల్పన" అన్నది ఆయన సిద్ధాంత రచన.

మోహన్‌రావు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణుడైన తొలి అంధ విద్యార్థి. అక్కడ అర్థిక శాస్త్రంలో పట్టం పుచ్చుకున్నాక, ఆయన సంగీతంలో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఎం. ఏ. పట్టం పుచ్చుకొని, శ్రీ వెంకటేశ్వర కళాశాలలో కొద్ది కాలం లెక్చరర్‌గా పని చేశారు. తరవాత యు. జి. సి. విద్యార్థి వేతనంతో ఢిల్లీ విశ్వవిద్యాయంలో సిద్ధాంతం రచన చేశారు.

## తూర్పు జర్మనీలో అంతర్జాతీయ సంస్కృత సమ్మేళనం

అంతర్జాతీయ సంస్కృత అధ్యయన సంఘం నాలుగో సమ్మేళనం తూర్పు జర్మనీ (జి. డి. ఆర్.) వీమెర్ నగరంలో మే 23 నుంచి 30 వరకూ జరుగనున్నది. 30 దేశాలనుండి సుమారు 200 మంది పండితులు దీనిలో పాల్గొన బోతున్నట్టుగా యిప్పటి కందిన సమాచాన్ని బట్టి తెలుస్తోంది.

## సమీక్ష

### అతడు – అమె (మూడవ భాగం)

రచయిత : డా॥ పుప్పల లక్ష్మణరావు
వెల : రూ. 7 50
ప్రచురణ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ-4

ఈ బృహత్తర నవల మొదటి రెండు భాగాలు ముప్పయ్యేళ్ల క్రితం 'అభ్యుదయ' లో ధారావాహికంగా వచ్చిన తరవాత గ్రంథ రూపంలో వెలువడింది. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ 1964 నుండి 1977 వరకూ మూడు సార్లు దీనిని ముద్రించింది (మొదటి రెండు భాగాలున్న 454 పుటల పుస్తకం వెల రూ. 12. (చూ. సమీక్ష 'అభ్యుదయ' 1977 అక్టోబరు సంచిక.)

ఇప్పుడు సమీక్షింప బడుతోన్న మూడవ భాగం కాలం 'క్విట్ ఇండియా' ఉద్యమం రోజులు, 1942 ఆగస్టు నుంచీ ఒకటి రెండేళ్లు. దీనికి పూర్వపు కథ (1, 2 భాగాలలోనిది) ఉప్పు సత్యాగ్రహానికి కొన్ని సంవత్సరాలకు ముందర మొదలై, 1942 జూన్‌లో ముగుస్తుంది. అంటే యీ మూడు భాగాలలో నడిచిన మొత్తం కథ, స్వాతంత్ర్యోద్యమం ఉధృతమవుతూ వుండిన ఒక ముఖ్యదశకు పూర్వరంగంగా వుంటూ, విద్యావంతులైన ఒక సంపన్నకుటుంబీకుల పైని దాని ప్రభావాన్ని ప్రతిబింబిస్తుంది. ఈ ముఖ్యపాత్రలు మసిలిన పరిసరాలు, ఆ పాత్రల పరిచయస్తులు, ఒడుదుడుకులు, మంచి చెడ్డలు మొదలైనవెన్నో కళ్ల ఎదటికొస్తూ పోతూ వుంటాయి, కథలో ఆదినుంచీ అంత వరకూ. ఎభై ఏళ్ల వయస్సులో నర్నో యీనాటి వారికి ప్రత్యక్షంగానో పరోక్షంగానో తెలిసివున్న ఆనాటి సామాజిక గాథను, దాని వెనకనున్న రాజకీయ చరిత్రను యింత విపులంగా, రమ్యంగా, నిదానంగా ఒక పెద్ద

మైదానమంత కేన్వాసు మీద లెక్క లేనన్ని పాత్రలతోను సంఘటనలతోను చిత్రించిన మనోహరమైన రంగురంగుల బొమ్మల కథ, 'అతడు ఆమె' నాటకాలలో 'కన్యాశుల్కం' సాటిలేనిదయినట్టుగా యిది నవలలో సాటిలేనిదని చెప్పడానికి సందేహించనక్కరలేదు.

మూడో భాగం కథ వెనక ప్రపంచంలో రెండో మహాయుద్ధమూ 'దేశంలో క్విట్ ఇండియా' ఉద్యమమూ విజృంభిస్తూ సాగిపోతూ వుండడంవల్ల, పూర్వపు ప్రధానపాత్రల కుమార్తెలు ప్రధాన పాత్రలవడం వల్ల కథా గమనంలో జోరు హెచ్చుతుంది, కొత్తదనం వస్తుంది, కొత్తతరం వారి జీవిత సరళి కథలో ప్రవేశిస్తుంది. ఒకటి – రెండు భాగాల్లోని శాంతమ్మ, చిదంబరశాస్త్రి దంపతుల డైరీలు కాక; వారి దత్తపుత్రిక సుభ, ఆమె ప్రేమిస్తోన్న మిలిటరీ యింజినీరు జనార్ధనం రాసుకుంటున్న డైరీలు కథను కొనసాగిస్తాయి. వారి రెండో కుమార్తె కమ్యూనిస్టు పార్టీ సభ్యురాలు లక్ష్మి, జనార్ధనం సత్తెకాలపు పిన్ని, ఐ. సి. ఎస్. ఆఫీసర్ మదనం, బ్రిటిష్ అధికారులు, లంచాలు మేపే కాంట్రాక్టర్లు, లంచాలు మేసే ఉద్యోగస్తులు, యింకా ఎందరెందరో పాత్రలూ, ఎన్నెన్నో ఘటనలూ, అవి కల్పించే సమస్యలూ వున్నాయి. సుభ 'క్విట్ ఇండియా' ఉద్యమానికి చెందిన యువతి, రైలు పట్టాలు విడగొట్టే ప్రయత్నాలతో సతమవుతూ వుంటుంది. కాని తాను ప్రేమిస్తున్న వాడు మిలిటరీ యింజినీరు, యిటువంటి పనులు ఎంతమాత్రమూ కిట్టనివాడు. కథలోని యీ కీలకాంశాన్ని రచయిత ఎంతో సమర్ధతతో చూపెట్టారు.

ఈ కథ ముగిశాక ఐదేళ్లలో సురాజ్యం కాకపోయినా, స్వరాజ్యం వచ్చింది. ఇప్పటికి యీ కథాకాలం తరువాత 37 ఏళ్ల కాలం గడిచింది. దేశంలోనూ, సమాజంలోనూ సాహిత్యానికెక్క వలసినవి చాలా జరిగాయి. కాని ఉత్త కాలక్షేప సాహిత్యానికి అవి అంటరానివి. విలువల విషయం చూస్తే, మేలిమి బంగారానికున్న దాని కంటె కాకి బంగారం రేటు చాలా చాలా ఎక్కువ. మన సంస్కారం పెరగందే యీ పరిస్థితి మారదు.

**విప్లవ ప్రజానాయకుడు**
**కామ్రేడ్ సుందరయ్య**

సంకలనం: 'చైతన్య, వెల: రూ.2 ప్రతులకు: ప్రజాశక్తి బుక్ హౌస్, విజయవాడ - 2

ఈ సంకలనంలో శ్రీ బొమ్మారెడ్డి, శ్రీ ఇ.ఎం.ఎస్. నంబూద్రిపాద్ రాసిన సుందరయ్యగారి జీవిత విశేషాలు; భారతదేశంలో విప్లవ సాధన గురించీ, భారత విప్లవ పంథా గురించీ శ్రీ సుందరయ్య వ్యాసాలు; ఆయన జీవితంలోని వివిధ ఘట్టాలకు సంబంధించిన కొన్ని ఛాయాచిత్రాలు వున్నాయి.

బాల్యంనుండీ, అర్ధశతాబ్దానికి పైగా అహో రాత్రాలు కష్ట జీవుల కోసం శ్రమించిన గొప్ప జీవితం సుందరయ్యగారిది. ఆయన త్యాగశీలం, నిరాడంబరత్వం ఆంధ్ర లోనే కాదు, దేశంలోనూ మన్నన పొందినాయి. దక్షిణాదిని కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతగా ఆయన సుప్రసిద్ధులు; తీవ్రమైన అభిప్రాయభేదాలున్న వారు సైతం గౌరవించే విశిష్టవ్యక్తి.

సుందరయ్యగారి జీవితాన్ని, ప్రధానంగా ఆయన దీర్ఘ రాజకీయ జీవితాన్ని

యీ చిన్న పుస్తకంలోని 20పుటలలో కుదించడానికి చేసిన ప్రయత్నం అసమగ్రంగా కనిపించక తప్పదు. ఇటువంటి జీవిత కథలు రేఖాచిత్రాలుగా కాక, సవివరంగా చెప్పవలసిన అవసరం వుంది. ఈ పుస్తకంలో చివరను చేర్చిన ఆయన రెండు వ్యాసాలు, దేశ విప్లవ రాజకీయాల గురించి మార్క్సిస్టు పార్టీ అవగాహనను వివరించాయి.

## స్వీకారం

**కొత్త పాళీలు**

వచన కవితా సంకలనం. సంకలనకర్త: బులుసు వెంకట కామేశ్వరరావు. వెల: రూ. 4. ప్రతులకు: ప్రగతి పబ్లిషింగ్ హౌస్, ఏలూరు రోడ్డు, విజయవాడ.

**మేధావి - కవి**

ఖండకావ్యాల సంపుటం. రచయిత: బుర్రా వెంకట నాగేశ్వరరావు. వెల: రూ. 1. 50. ప్రతులకు: బుర్రా వెంకట నాగేశ్వరరావు, 'శారద', కొత్త వీధి, చోడవరం - 531 036.

**అరుణోదయం**

కథలసంపుటి. రచయిత: అరుణకిరణ్. వెల: రూ. 4. ప్రతులకు: పైల సూర్యనారాయణ, కోట్లమూదప్ప వీధి, విజయనగరం - 531 202.

**మరో ప్రపంచం కోసం**

కవితా సంపుటి. రచయిత: రాధేయ. వెల: రూ. 4. ప్రతులకు: విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ - 4.

**విభావరి**

అనిబద్ధ కవితా ఖండికలు రచయిత: సి. హనుమయ్య. వెల: రూ. 10. ప్రతులకు: వావిలాల సుబ్బారావు, అమరావతి, గుంటూరు జిల్లా.

**భావనా తరంగాలు**

గేయ సంపుటి. రచయిత: భా. వ. నరసింహం. వెల: రూ. 3 - 25. ప్రతులకు: బి. వి. నరసింహం, Qr. No. 6 – B, Street,4, Sector 10, Bhilai.

## లేఖలు

### చైనా దురాక్రమణను రచతయిలంతా ఖండించాలి

చైనా దురాకమణను ఖండిస్తూ వియత్నామ్ పట్ల సంఘీభావం ప్రకటిస్తూ అభ్యుదయ రచయితలంగరూ తమ సంతకాలతో ఒక సమైక్య ప్రకటన చేయాలి. అభ్యుదయ రచయితల సంఘం ఆఫ్రో - ఆసియన్ సంఘీభావ రచయితల సంఘం దీని కోసం కృషి చేయాలి.

ఒక పాఠకుడు — ఖుర్దా

### ఒక ప్రశంస

'బలం ఉన్నవాడికన్న బలంలేనివాడు బలవంతుడు' అన్న రచనను 'అభ్యుదయ' ఫిబ్రవరి సంచికలో చదివాను. గోరంతదీపం కొండంత వెలుగు అన్నట్లు మన వ్యవస్థకే దర్పణం పట్టింది. చెప్పింది కొద్ది అయితే అర్థం చేసుకోవలసింది అనంతం అనిపిస్తుంది. నమ్మిన వాటిని ఆచరణలో పెట్టగల సత్తా పెంపొందించుకోవాలి.

సి. ఎస్. మణి — బెంగళూరు
(కన్నడ పక్ష పత్రిక 'కథామంజరి' సంపాదకుడు)

### సవరణ

మార్చి 'అభ్యుదయ' చర్చావేదిక రిపోర్టు చాలా బాగుంది. కాని మొదటి మళయాళ నవల పేరును తప్పుగా ముద్రించారు. ఆ నవల పేరు "ఇందు లేఖ" అని వుండాలి.

తారీఖులను జాగ్రత్తగా నమోదు చేసినప్పటికీ మళయాళ, కన్నడ నవలలను చర్చిస్తూ రెండుభాషలలోనూ మొదట నవల ఏకకాలంలో అంటే 1889లో వెలువడిందని వ్రాసాను. మళయాళం వరకు ఆతారీఖు సరైందే, కాని కన్నడ భాషలో మొదట నవల 1889 లో కాక 1899 లో వెలువడింది. నా వ్యాసంలో ఈ తప్పు దొర్లినందుకు చాలా విచారిస్తున్నాను.

ఎ. బి. సాయిప్రసాద్ — మద్రాసు

### 'గ్రామ నామాల ప్రయోజనం'

ఫిబ్రవరి 1979 'అభ్యుదయ' లో చర్చావేదిక లోని "... స్థలనామ పరిశోధనకు దేశం

మొత్తంలో మొట్టమొదట తెలుగు నాటనే ప్రయత్నం ప్రారంభమయిందనీ, ఆ పని నెత్తి కొన్న ప్రథములు తామేననీ శ్రీ విశ్వనాథ రెడ్డి చెప్పేరు. ఈనాడు ఇతర విశ్వవిద్యాలయాలు కూడా ఈ పరిశోధనకు పూను కొన్నాయన్నారు" అన్నది సత్యదూరం డా. సరయూ ప్రసాద్ అగ్రవాల్‌గారు "అవధ్ కే గ్రామ్‌నామోంకా బాషావైజ్ఞానిక్ అధ్యయన్" అనే సిద్ధాంత వ్యాసాన్ని హిందీలో సమర్పించి 1965 లోనే లక్నో విశ్వవిద్యాలయంచే డి. లిట్. డిగ్రీ పొందారు. ఈ సిద్ధాంత వ్యాసం నాలుగైదేళ్ల క్రిందట లక్నో విశ్వవిద్యాలయం ద్వారా ప్రచురింప బడింది.

అంతేకాక శ్రీమతి ఉషా చౌధరి గారు 'మురాదాబాద్ జిలేకే స్థాన్ - నామోంకా భాషా వైజ్ఞానిక్ అధ్యయన్' అనే సిద్ధాంతవ్యాసం వ్రాసి హిందీలో లక్నో విశ్వవిద్యాలయం ద్వారా పి. హెచ్‌డి. డిగ్రీ పొందారు వీరి సిద్ధాంతవ్యాసం 1970లో అచ్చయింది కూడా. పై విషయాల ద్వారా స్థల నామాల పరిశోధన తెలుగు దేశంలోనే మొట్టమొదట ప్రారంభమయిందనే సంగతి నిజం కాదని తేలుతుంది. స్థలనామాల గురించి హిందీ కంటె ముందుగా బెంగాలీ భాషలో విస్తృతంగా, గంభీరంగా పరిశోధన కావింప బడ దని డా. అగ్రవాల్ గారు ఉషా చౌధరిగారి థీసిస్‌కు వ్రాసిన 'ఆముఖ్'లో పేర్కొన్నారు.

కేతు విశ్వనాథరెడ్డి గారి పరిశోధన ఈ రంగంలో తెలుగులో ప్రప్రథమంగా పెద్ద ఎత్తున పిహెచ్. డి. డిగ్రీకై జరిగిందనే మాట అందరూ ఒప్పుకోవలసిన సంగతి.

ఘట్టమరాజు అశ్వత్థ నారాయణ

బెంగుళూరు

## ఫిబ్రవరి సంచికలోని రెండు కథలు

ఫిబ్రవరి 'అభ్యుదయ'లోని విశ్వనాథ శర్మ గారి 'ఉద్ధరిణి' (మినీ కథ) నేటి మన సాహితీ ప్రపంచానికి ఒక దర్పణం. కథలో "నా పాటోళ్ళు కథల్ని ఒకటికి పది కల్పించి రాసి డబ్బు చేసుకుంటున్నావ్," అన్న పద్దన్న మాటలు మన సాహితీ వ్యాపారులకి మంచి చురక. రచయితకి అభినందనలు

అదే సంచికలోని చామర్తి దుర్గా ప్రసాద్ గారి "ఆడ పిల్లల తండ్రి" కథానికలో యీ నాలుగు పంక్తులు తీసివేసి కథ చదువుకుంటే, అంటే "ఆ పార్శెల్‌ని బీరువాలో పెడుతుంటే కనబడ్డాయి ఎన్నో వ్రాత ప్రతులు - దిగులుగా కన్నె చెర విడిపించ మంటూ" అన్న వరకు కథ ఎంతో బావుంది. కానీ ఆ చివరి నాలుగు పంక్తులు "ఒకర్తెకూ పెళ్ళి చేయలేని తను మరో కూతుర్ని కనటం ఎంత పాపం! ఆ పాపానికి ప్రాయశ్చిత్తం తను అనుభవించ వలసిందే" అన్న పంక్తులు చేర్చి చదువుకుంటే కథ అశాస్త్రీయంగా ఉంది. కథ ప్రచురణని, కుమార్తె పెళ్ళితో పోల్చటం చాలా వాస్తవంగా ఉంది. రచయితలు అంతటి కష్టాలకి గురి కావల్సి వస్తోంది నిజమే గానీ, ఒక రచన ప్రచురణ కానంత మాత్రాన మరోటి రాయకూడదన్న భావం మాత్రం హర్షనీయం కాదు.

రమేష్ రాజు బరంపురం

## కవితా సంపుటాలకి బహుమతి

అమలాపురం సమతా రచయితల సంఘం 1978వ సంవత్సరంలో వెలువడిన వచన కవితా సంపుటాలలో ఉత్తమ కవితా సంపుటానికి రు. 116. బహుమతి నిర్ణయించాం. కావున రచయితలు 1978లో వెలువడిన తమ తమ కవితా సంపుటాలను ఈ క్రింది అడ్రస్సుకు రెండేసి ప్రతులు చొప్పున పంప వలసిందిగా రుకోచున్నాము. వివిధ కవుల సంకలనాలు మాత్రం పోటీకి అంగీకరించబడవు. సంపుటాలు మాకు అందవలసిన ఆఖరు తేదీ ఏప్రియల్ 15

కొల్లూరి సూర్యనారాయణ మూర్తి,
అధ్యక్షులు - సమతా రచయితల సంఘం,
అలాపురం 533201

చర్చా వేదిక
మినీకోయ్ జీవిత విశేషాలు
(శ్రీ సుదర్శన్ పర్యటవానుభవాలు)
ఏప్రిల్ 1 సాయంత్రం 6 గంటలకు
పొట్టి శ్రీరాములు స్మారక
మందిరంలో



కబిస్తాన్లోని (సోవియట్ అజర్ బైజాన్) క్రీస్తు పూర్వపు 8,000 - 7,000
సంవత్సరాలనాటి శిలా చిత్రాలు

Edited and Published by T. Venkataramaiah, at 12, Arulammal Street, Madras-600 017 and Printed at Stree Seva Mandir Press, Madras-17 for Sri Venkateswara Printers, Madras-600 021.